# ఆంధ్రపత్రిక



317227

The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 35 No. 216 TUESDAY 9th NOVEMBER 1948 వెల ఒక అణా Founder: K. Nageswara Rao

# గాంధిజీని తానే కాల్చి చంపినట్లు గాడ్సే ప్రకటన

## రాజ్యాంగనిర్మాణమునకు పరిషత్తుకు హక్కులేదు

### హిందూమహాసభ కార్యవర్గ తీర్మానము

న్యూఢిల్లీ, నవంబరు 7: భారతదేశమునకు నూతన రాజ్యాంగమును నిర్మించ ప్రస్తుత రాజ్యాంగ పరిషత్తునకు అధికారము లేదని నేడు తిరిగి సమావేశమైన హిందూమహాసభ కార్యవర్గం తీర్మానించెను. పరిషత్తును ఎన్నుకొనిన శాసనసభలు వయోజన ఓటింగుపద్ధతి మీద ఏర్పడినవి కాకపోవుటేగాక అశాసనసభ ఎన్నికలు వేరే సమస్యలను తేల్చుటకు జరిగినవని వారి అభిప్రాయం. అఖండ హిందూస్థాన్ స్థాపన, హిందీ జాతీయభాషగాను, సంస్కృతలిపి, జాతీయలిపిగా ఏర్పరుచుట, అన్ని తరగతుల ప్రజలను సంఘటితపరచి, వారందరికీ సమానహక్కులను కలుగజేయు సాంఘిక వ్యవస్థను స్థాపించుట, ఆర్థిక సమానత్వమును పెంపొందించుట, గోరక్షణ ఏర్పరచి గోవధను నిరోధించుట, అంతర్జాతీయ శాంతిస్థాపనకు, అన్ని దేశములతో స్నేహ సంబంధములను పెంపొందించుట మొదలైనవి హిందుమహాసభాలక్ష్యములుగా నుండవలెనని తీర్మానించినది. ఈ తీర్మానములను ఆలోచించి ఆమోదించుటకు, డిశంబరు 25, 26 న అ. భా. హిందూమహాసభ స్థాయిసంఘమును సమావేశపరచవలెనని నిర్ణయించెను.

## ఆత్మాచరన్ కోర్టులో ప్రధాన నిందితుడు నాథూరాం వాఙ్మూలం

### నైతికదృష్ట్యా నేనుచేసినదాంట్లో ఆవంతైనాతప్పులేదనే నాఅభిప్రాయం

### హిందూస్థాన్ క్షేమాన్ని అభిలషించే ఈ పాతకానికి ఒడిగట్టినట్లు వివరణ

#### గాడ్సే పడిపోయెను

నాథురాం గాడ్సే 11 గంటలకు నేడు కోర్టులో తన వాఙ్మూలం చదువుట ప్రారంభించి 37 పేరా చదువుచుండగా, వేళ్లు వణక నారంభించినవి. మొఖం తిరిగి క్రింద పడిపోయెను. కాగితాలు ముందే పడిపోయినవి. ప్రక్కనున్న పోలీసువాడు లేవదీయగ, జడ్జి గాడ్సేను కూర్చొని విశ్రాంతి గైకొనమనెను. విశ్రాంతిగైకొన్నాక అతను లేచి చదువ నారంభించెను. పావుగంట తరువాత కాలు నొప్పిగానుందని చెప్పగా కూర్చొని చదువుటకు జడ్జి అనుమతించెను.

ఎఱ్ఱకోట, నవంబరు 8:— "గాంధీజీ సలహాపై కాంగ్రెసు నాయకులు దేశ విభజనకు అంగీకరించి హిందూ సమాజాన్ని ఎంతటి ఘోరమైన దురవస్థకు పాల్పడజేసినదీ, కళ్లారా చూసినవాణ్ణి అవడంచేతనూ, లోపల గాంధి తత్వము వెలుపల పాకీస్తానూ ఇలాగే నిలిచి ఉంటే దేశానికి ఇంకా ఎంతటి మహానర్థాలు వాటిల్లగలవో విస్పష్టంగా గ్రహించినవాణ్ణి అవడంచేతనూ, గాంధీజీని తుదముట్టించటం వినా తరణోపాయం లేదని ఆకస్మికంగా నేను ఒక నిర్ణయానికి వచ్చితిని. నా ఈ ఉద్దేశ్యమును ఇతరులకెవ్వరికీ తెలియనివ్వ కూడదనీ, రెండోమనిషి సహాయంలేకుండా నా ఒక్క చేతిమీదుగానే ఈ పనిని నిర్వహించవలెననీ కూడ నేను నిశ్చయించుకొంటిని. గడచిన 32ఏళ్లుగా హిందూ సమాజమునకు గాంధీజీ చేయుచువచ్చిన అపచారములు నా మనస్సులో విద్వేషానలమును రగుల్కొల్పినవి. లోగడ చేసిన ఈ అపచారములన్నీ చాలవన్నట్లుగా, గాంధీజీ చివరిసారి నిరశన వ్రతం చేసి పాకీస్తాన్‌కు రూ 55 కోట్లు బలవంతంగా ఇప్పించడంతో, నాలో ఇంతకాలముగా రగుల్కొంటున్న విద్వేషానలం ఒక్కసారిగా భగ్గుమన్నది. గాంధీజీ ఐహికజీవితానికి వెంటనే స్వస్తి చెప్పవలెనన్న సంకల్పం హఠాత్తుగా నాలో వజ్రప్రాయమై కూర్చున్నది."

ఈ విధంగా అసందిగ్ధమైన

[6 పేజి చూడుడు]

## ఇంగ్లండ్‌లో భారతీయ కార్మిక క్షేమ విచారణాధికారులు

కవెంట్రీ, నవంబరు 8: లండన్, కవెంట్రీ, బర్మింఘామ్, లివర్పూల్‌లలో భారతీయ కార్మికుల యోగక్షేమములను కనిపెట్టుటకు వెల్ఫేర్ అధికారులను నియమింపవలసిందని, కవెంట్రీ భారతీయ కార్మికుల సంస్థ భారత ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేయ నిశ్చయించుకున్నది.

గతరాత్రి ఇక్కడ జరిగిన భారతీయ కార్మికసంఘ సమావేశంలో అధ్యక్షుడు దేదరీ అక్బర్‌ఖాన్ ఈ విషయమును వెల్లడించెను. గ్రీసులో ట్రేడ్ యూనియన్ నాయకులపై మరణశిక్ష విధించినందుకు అధిక్షేపణ తెల్పుతూనూ, దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం అవలంబించుచున్న జాతి విచక్షణ విధానాన్ని గర్హించుచునూ సభలో తీర్మానములు చేయబడెను.

## చాంగ్ కైషెక్ రాజీయత్నం

### కమ్యూనిస్టులతో రాయబారాలు, పరిపాలనాపద్ధతి మార్పు

టీంట్సిన్, నవంబరు 7: కమ్యూనిస్టులతో సంధి సంప్రదింపులకు చైనా నాయకులు సిద్ధపడుచున్నారని నేటివార్తలు తెలుపుచున్నవి. పూర్వం రష్యాలో చైనీస్ రాయబారిగా పనిచేసిన షావ్ లీ-ట్జీ సంధికర్తగా నియమింపబడి టిబెట్, లోపలి మంగోలియాల సరిహద్దుల్లో ఒక మూలగా ఉన్న కన్సూరాష్ట్రానికి వెళ్లెను. ఇక్కడనుండి అతడు కమ్యూనిస్టులతో రాయబారములు సాగించును.

వాయువ్య చైనాలోని ప్రభుత్వసేనాని జనరల్ చాంగ్‌చీషంగ్ జనరలిజ్మో చాంగ్‌కైషేక్‌ను, నాన్కింగులోని అమెరికన్ రష్యన్ రాయబారులను దర్శించి సంధిసంప్రదింపులు సాగించే విషయమై మాట్లాడినాడని తెలియుచున్నది.

### రజాకార్ ఖైదీలు

కార్వార్, నవంబరు 8: నూరుమంది రజాకార్ ఖైదీలను బెల్గాంనుండి శుక్రవారంనాడు ఇచ్చటికి తీసుకొనివచ్చి జెయిలులో వుంచిరి

### విధానమును మార్చుకొనుటకు చాంగ్ సంసిద్ధత

నాన్‌కింగ్, నవంబర్ 7: మంచూరియా, ఉత్తర చీనాలను ఆక్రమించి తన రాజధాని నాన్కింగ్ మీదికే కమ్యూనిస్టులు విరుచుకుని పడుతున్న ఈ సమయములో చాంగ్‌కైషేక్ ప్రజాసహకారం కొరకై తన విధానాలను మార్చువ నే సూచన కనిపిస్తున్నది. ప్రజలంతా తనతో సహకరించి కమ్యూనిస్టు ప్రమాదాన్ని అరికట్టవలెననీ, తాను నిరంకుశాధికారాలను వదులుకుని, ధనిక కుటుంబాలపై చూపుతున్న పక్షపాతాన్ని విసర్జిస్తాననీ చాంగ్ చెప్పునని తెలుస్తున్నది. ప్రభుత్వ విధానములో ప్రధాన మార్పులను రేపు ప్రకటించనున్నానని చాంగ్ ప్రకటించి ఉన్నాడు.

చాంగ్ ప్రకటనలో ఈ కింది మూడు ప్రధానాంశాలు ఉండునని అభిజ్ఞవర్గాలు భావిస్తున్నారు.

(1) ప్రజలంతా కలిసి కమ్యూనిస్టు విజృంభణను అరికట్టవలెనని విజ్ఞప్తి చేసి, అంతిమవిజయం తమదేనని ఉద్ఘాటించును.

(2) ప్రభుత్వ నిర్వహణంలో తనవ్యక్తిగతాధికారాలను చాలావరకు వదులుకుని

4 వ పేజి చూడుడు

## ఫ్రాన్సులో ఎగువ శాసనసభ ఎన్నికలు

### డిగాల్‌పక్షమునకు విజయ సూచనలు

ప్యారిస్, నవంబరు 7: ఫ్రెంచి పార్లమెంటుయొక్క ఎగువ శాసనసభ యగు "కవున్సిల్-అఫ్-ది రిపబ్లిక్" ఎన్నికలు జరుగుచున్నది. డిగాల్ పక్షమువారే యెక్కువగా ఎన్నుకోబడుచున్నారు. ఇంతవరకు ఫలితములు తెలిసిన 120 స్థానములలో 63 స్థానములకు డిగాల్ పార్టీవారే ఎన్నుకోబడిరి. లండను టైము ప్రకారం సాయంత్రము 4 గం.వరకు లెక్క చూపగా సోషలిస్టులు 22 మంది, కమ్యూనిస్టులు 14 మంది, రాడికల్సు 9 మంది, స్వతంత్రపక్షమువారు 6 గురు పాపులర్ రిపబ్లికన్స్ 5 గురు, మితవాదులు ఒక్కరు ఎన్నుకోబడిరి. ప్యారిసునగరంలో 20 స్థానములకు ఎన్నిక జరుగవలెను. ఇందులో 8 స్థానములను డిగాల్ పార్టీవారు ఎన్నుకోబడిరి. వీరి నాయకుడు డిగాల్ సోదరుడగు డియరీడీగాల్‌గారే ప్యారిసులో కమ్యూనిస్టులకు 8 స్థానములే వచ్చెను.

కొత్త ఎన్నికపద్ధతి సరియైనది కాదని కమ్యూనిస్టులు ఆక్షేపించుచున్నారు. డిగాల్ పార్టీవారు కూడా ఆక్షేపించుచున్నారు.

ఎగువసభకు వోట్లు చేయగల వోటర్లు 1 లక్ష మంది కలరు. ఈ వోటర్లు మూడు వారాల క్రింద సార్వజనిక వోటింగు ద్వారా నిర్ణయింపబడిరి. ఎగువసభకు 320 మంది సభ్యులు ఉండాలి. కాని ప్రస్తుతము నేడు జరిగే ఎన్నికలలో 269 మంది మాత్రమే ఎన్నుకోబడుచున్నారు. మిగిలిన 51 మంది సభ్యులు ఫ్రాన్సుకు చెందిన ఖండాంతర దేశాల తరఫు ప్రతినిధులుగా ఎన్నుకోబడవలసి యున్నారు. వీరి ఎన్నిక తరువాత జరుగవచ్చునని వాయిదా వేసిరి. ఇందుకు డిగాల్ పార్టీవారు ఆక్షేపణ చెప్పుచున్నారు. డిగాల్‌పార్టీ అనేది ఏర్పడి 12 మాసాలైనది. ఫ్రాన్సులోని గ్రామీణ ప్రాంతాలనుండి గాక వేర్వేరు పట్టణముల నుండియు, నగరములనుండియు మొత్తము 244 మంది ఎన్నుకోబడవలెను. వీరిలో 105 మంది డిగాల్ పక్షమువారు ఎన్నుకోబడినట్లు ప్యారిసు టైము ప్రకారంగా రాత్రి 9 గంటలవరకు లెక్క తేలినది. పాప్యులర్ రిపబ్లికను పార్టీ చాలా అపజయము పొందినది.

పై జెప్పిన బస్తీ స్థానాలలో సోషలిస్టులకు 46 స్థానము లభించినవి.

కమ్యూనిస్టులకు 16 లభించినవి.

### సౌరాష్ట్ర రాజ్యాంగ పరిషత్తు

రాజకోట, నవంబరు 7: సౌరాష్ట్ర రాజ్యాంగ పరిషత్తుకు 5 మంది సభ్యులను ఎన్నుకొనుటకుగాను జల్వాన్ జిల్లాలో ప్రజలునిన్న ప్రథమపర్యాయంగా వోటింగు చేసిరి. వోటింగుకు సరియైన ఏర్పాట్లు చేయబడలేదనీ అనేకమంది ప్రజలు దొంగ వోట్లు వేసిరనీ తెలియుచున్నది. అయినా కాంగ్రెసు అభ్యర్థులకే విజయము లభించగలదని ఆశించుచున్నారు.

## నెహ్రూ, పటేల్, పట్టాభిగార్లకు కేంద్ర కాంగ్రెస్ పక్ష అభివందనములు

### భారత ప్రధానిలో కారాధ్యుడైనాడని శ్రీగోపాలస్వామి అయ్యంగారి ప్రశంస

న్యూఢిల్లీ, నవంబరు 7: రాజ్యాంగ పరిషత్తునందలి కాంగ్రెస్ పార్టీ పక్షమున శ్రీ గోపాలస్వామి అయ్యంగారు ప్రధాని పండిత నెహ్రూను అహ్వానించుచు ఆయన భారత మహాజనమునకు పూజ్యుడు, ఆరాధ్యుడునని, ఇప్పుడాయన యావత్ ప్రపంచమునకు ఆరాధ్యుడయ్యెనని చెప్పిరి. బ్రిటనులోను, ఐరోపాఖండములోను ఆయన కొసంగబడిన బ్రహ్మాండమైన స్వాగతమునకు భారతదేశము కాంగ్రెసుపార్టీ గర్వించుచున్నారనిరి. పండిత నెహ్రూగారి నిష్కాపట్యము, చిత్తశుద్ధి పశ్చిమఖండవాసుల మానసములను హరించి నందులకు తానెంతయు సంతసించుచుండెననిరి.

శ్రీ గోపాలస్వామిగారు సర్దారు పటేలు విషయమై ప్రస్తావించుచు ఆయన వజ్ర సంకల్పుడనిరి. యావద్భారతదేశమును ఏకముచేయుటకుగాను సర్దారు దీర్ఘాయుష్మంతుడగునని ఆశించిరి. కేంద్రప్రభుత్వములో అన్నిరాష్ట్రముల యొక్కయు, అన్ని సంస్థానముల యొక్కయు రాజ్యాంగసంబంధములు ఒకేవిధముగా నుండునట్లు చేయుట సాధ్యమగునని ఆయన ఆశించెను. తరువాత ఆయన డా॥ పట్టాభిసీతారామయ్యగారిని అధ్యక్షపీఠము నలంకరించవలెనని: పార్టీసభలో రాజ్యాంగవిధానముపై ఒడుగుచర్చను నడుపవలెనని ప్రార్థించిరి.

కాంగ్రెసు మహాసభాధ్యక్షపీఠమున కెన్నుకొనబడినందుకు కాంగ్రెస్‌పార్టీ పక్షమున ఆయన డా॥ పట్టాభిసీతారామయ్యగారి నభినందించిరి. డా॥ పట్టాభిసీతారామయ్యగారు కాంగ్రెస్‌సేవలో వృద్ధుడైన మహాశయుడని, భారతస్వాతంత్ర్యమునకై పోరాడిన వీరపుంగవుడని శ్రీ గోపాలస్వామిగారనిరి.

## కామన్వెల్తు దేశాల పౌరులకు ప్రత్యేక పౌరసత్వపుహక్కులు?

న్యూఢిల్లీ, నవంబరు 7 సర్వస్వతంత్ర రిపబ్లికుగా నుండవలెనన్న ఇండియా ఆశయమునకు భంగము కలుగని పద్ధతిలో ఇండియాను కామన్వెల్తులోనే ఉంచుటకు మరొక క్రొత్తమార్గం ఆలోచించ బడుతున్నదని ఇక్కడి అభిజ్ఞవర్గాలవలన తెలుస్తున్నది. కామన్వెల్తు దేశాల పౌరులకు 'ద్వదేశ పౌరత్వపు' హక్కులను ఇవ్వటమే ఈ క్రొత్తమార్గం అని తెలుస్తున్నది. దీని ననుసరించి కామన్వెల్తు దేశాలప్రజలు భారతదేశానికి వచ్చి నివసిస్తున్నప్పుడు వారికి ఇక్కడకూడా పరిమిత పౌరసత్వపు హక్కులు ఇవ్వబడతవి. అంటే భారత

(4 వ పేజి చూడుడు)

## హిందీతోబాటు 15 సం॥లవరకు ఇంగ్లీష్ కూడ జాతీయభాషగ ఉండాలి

### పరిషత్తులోని దక్షిణ భారతప్రతినిధుల సూచన

న్యూఢిల్లీ, నవంబరు 7: శుక్రవారమునాడు పరిషత్తు చర్చలో ప్రాధాన్యత వహించిన జాతీయ భాషా సమస్యపట్ల తమవైఖరిని నిర్ణయించుటకు గాను, పరిషత్తులోని, ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రతినిధులు నేటి సమావేశము, శ్రీ అనంతశయనం గారి అధ్యక్షతను సమావేశమైరి. మద్రాసు ప్రధాని శ్రీ ఓమందూరి రామస్వామి రెడ్డి, టి. ప్రకాశం, ఎన్. జి. రంగా, అర్. ఆర్. దివాకర్ ప్రభృతులు ఈ సమావేశమునందు పాల్గొనిరి. హిందీ అఖిలభారత జాతీయ భాషగా ఉండవలెననీ, రాష్ట్రములందు మాతృభాషయే ప్రభుత్వ భాషగా నుండవలెనని ఏకగ్రీవముగ తీర్మానించిరి. ఇంకొ పదిహేను సంవత్సరముల వరకు హిందీతో పాటు ఇంగ్లీషు కూడ, రెండవ జాతీయ భాషగ నుండవలెనని కూడ తీర్మానించిరి. జాతీయ భాషకు దేవనాగరి లిపిగ నుండవలెననిరి. ఈతీర్మానములను రాజ్యాంగ పరిషత్తునకు, ప్రధానికి, ఉపప్రధానికి అందచేయుదురని తెలియుచున్నది.

మదరాసు ట్రామ్వే కంపెనీ పనివాడు వరదయ్య అనువాడు కమ్యూనిస్టునకు ఆశ్రయమిచ్చినందున నేరమునకు అరెస్టు చేయబడెను.

## శాంతిస్థాపనకై రష్యా ప్రయత్నాలకు విఘాతాలు

### పాశ్చాత్యరాజ్యాలపై సోవియట్‌సేనాని ఆరోపణ

### సోవియట్ రష్యా వార్షికోత్సవ సందర్భంలో స్టాలిన్‌కు నెహ్రూ ప్రభృతుల సందేశాలు

మాస్కో, నవంబరు 7: "ప్రపంచ శాంతికోసం సోవియట్ రష్యా చేసే ప్రయత్నాలను బ్రిటన్, అమెరికాలలోని యుద్ధప్రోత్సాహకులు భగ్నం చేయుచున్నారు. కాని వారి యుద్ధప్రోత్సాహ మెప్పటికీ ఫలించదు. ఎందుకంటే శాంతిని కోరే ప్రజాశక్తులు రోజు రోజుకూ బలీయమవుతూ, మరొక యుద్ధం ప్రారంభింపకుండా చేయుటకు కృతనిశ్చయములై ఉన్నవి." అని గత యుద్ధంలో రష్యన్ సేనాధిపతిగా పేరుగాంచిన మార్షల్ టిమోషెంకో నేడు మాస్కోలోని రెడ్ స్క్వేర్ వద్ద రష్యన్ విప్లవ వార్షికోత్సవ సందర్భంలో సైనిక విన్యాసములు జరిగినప్పుడు ఉద్ఘాటించెను.

ప్రజాస్వామిక శాంతికోసం సోవియెట్ యూనియన్ దృఢకంకణధారియై ఉన్నదని, శాంతికాముక దేశాలన్నీ, యుద్ధకాముక దేశాలను నిరోధించవలసిన అగత్యమును బాగుగా గుర్తించుచున్నారనీ, శాంతి భద్రతలకూ, స్వాతంత్ర్యమునకూ ఒక్క రష్యాయే పట్టుగొమ్మ అని వారు గుర్తించినారనీకూడ అతడు ప్రకటించెను.

సోవియెట్ యూనియన్ తలపెట్టిన శాంతియుత నిర్మాణ కార్యక్రమమును కాపాడుటకై మాత్రమే రష్యన్‌సేనలు నిలచియున్నవని, కాని ఈ పనిచేస్తూ అవి యుద్ధపరిస్థితుల కెప్పుడు తయారుగా ఉండవలెనని మార్షల్ టిమోషెంకో అన్నాడు.

ఈ సైనిక విన్యాసములకు మార్షల్ స్టాలిన్ హాజరుకాలేదు. కాని ఆయన కుమారుడు వాసిలీస్టాలిన్ మాత్రము బాంబరు విమానాల విన్యాసమునకు నాయకత్వం వహించెను. మిలిటరీ సంగీతంతో విన్యసించే సేనలకు వెనుక సోవియెట్ కార్మికులు స్టాలిన్ పటమొకదానిని ముందిడుకొని నడచిరి. విన్యాసములకు మొలటోవ్ మున్నగు ప్రముఖ నాయకులు హాజరైరి. బ్రిటిష్, డేనిష్, నార్వేజియన్, స్వీడిష్, ఆస్ట్రేలియన్, ఇండియన్ ప్రతినిధులుకూడ హాజరైరి.

"చైనీస్ ప్రభుత్వముతరఫున, ప్రజల తరఫున, మీకు, మీ ప్రభుత్వమునకు, మీ ప్రజలకు నేను హృదయపూర్వక అభినందనములు తెలియజేయుచున్నాను." అని చాంకైషేక్ సోవియెట్ అధ్యక్షుడు నొకొలాయ్ షివర్నిక్‌కు సందేశ మంపెను.

జెకొస్లావాకియా, ఫిన్లాండు, పోలెండు, ఉత్తర కొరియాలనుండి, భారతప్రధాని పండిట్ నెహ్రూనుండి కూడ స్టాలిన్‌కు సందేశములు వచ్చినవి.

### రష్యాకు చాంకైషేక్ సందేశం

31 వ రష్యన్ విప్లవోత్సవమునకు చైనీస్ అధ్యక్షుడు చాంకైషేక్ స్నేహపూర్వక అభినందన సందేశము పంపించెను.

## భద్రతామండలి యుద్ధవిరమణ ఆదేశానికి ఇజ్రాయిల్ జవాబు

### జెరూసెలం పరిసరాల్లో తిరిగి యుద్ధప్రజ్వలన

టెల్‌అవీవ్, నవంబరు 7: పాలస్తీనాలోని నెగెవ్ ప్రాంతంలో అరబ్బుసేనలు ఇజ్రాయెలుసేనలు పోరాటం విరమించవలెననియు, గతవారంలో పోరాటము ప్రారంభించకపూర్వము ఏప్రదేశాలలో ఉభయసేనలు ఉండెనో ఆ ప్రదేశములకు మరలి పోవలెననియు ఆయా పూర్వస్థానములు ఏవో, పోరాటం విరామస్థానముల హద్దులేవో ఉభయపక్షముల ప్రతినిధులు ముఖాముఖి నిర్ణయించుకోవలెననియు లేనియెడల ఐక్యరాజ్య సమితి యొక్క మధ్యవర్తుల ద్వారా నిర్ణయించుకోవలెననియు భద్రతామండలి గురువారమునాడు తీర్మానము చేసెను.

ఈ భద్రతామండలి తీర్మానమును యూదీయ ప్రభుత్వమగు ఇజ్రాయిలు ప్రభుత్వవర్గము పరిశీలించినది. చిట్టచివరకు ఇజ్రాయిలు ప్రభుత్వవర్గమువారు "భద్రతామండలి తీర్మానమును గమనించడమైనది" అని మాత్రమే తమ సమాలోచన పర్యవసానముగా ప్రకటించిరి. యూదులు తమసేనలను యథాపూర్వ స్థానములకు ఉపసంహరించుకొను విషయములో కాలహరణము చేయునిమిత్తమున్న, తమకు అపని ఇష్టములేదనే విషయమును తెలియజేయుటకు వాయిదా వేయు నిమిత్తమున్నపై రీతిగా ప్రవర్తించుచున్నారని వ్యవహారజ్ఞులు తలంచుచున్నారు.

పాలస్తీనాలో యూజిప్టుసేనలు తిమరంగములలో పోరాడుటలేదని నేడు యీజిప్టు ప్రభుత్వపు యుద్ధశాఖమంత్రియగు మహమ్మదు హైదరుపాషా చెప్పెను.

### గత రాత్రి యెరూషలేము రంగంలో యుద్ధం

గత రాత్రి యెరూషలేములోని అన్ని రంగములలోను యూదీయ సైనికులు ఫిరంగులను కాల్చుచునేయున్నారు.

ఇద్దరు అరబ్బులు గాయపడిరి. ఐయిక్యరాజ్యసమితియొక్క తటస్థ ప్రాంతము మీద కూడా ఫిరంగులు కాల్చబడెననియు యెరూషలేముపద్దనున్న ప్రభుత్వభవనము చుట్టుసరంగిసంధ్లుపడెననియు నేడుఅరబ్బీ సైనికాధికారవర్గములు తెలియచేసెను.

### రష్యాసహాయం అసత్యం

పాలస్తీనాలోని యూదీయ స్వతంత్ర ప్రభుత్వపు విదేశాంగ కార్యాలయ ప్రతినిధి ఇట్లుచెప్పెను. రష్యావల్ల ఇజ్రాయిలు ప్రభుత్వానికి ఏ విధమైన సహాయమున్ను లభించుటలేదు.

# రజ్వీసోదరుని పేరుతో ఇంపీరియల్ బ్యాంకులో నున్న నిజాం ధనం

## బిగపట్టి ఉంచవలసిందిగా భారత ప్రభుత్వానికి హైదరాబాద్ ప్రభుత్వం విజ్ఞప్తి

హైదరాబాద్, నవంబరు 7: రజాకార్ నాయకుడు కాశింరజ్వీ అన్న ఇబ్రహింరజ్వీ తన స్వాధీనంలో నున్న సంస్థాన ధనమునుండి రు 17200 లను లాహోరులోని ఇంపీరియల్ బ్యాంకులో డిపాజిటుగా ఉంచెను. ఆ మొత్తమును అతనికిగాని, అతని ఉత్తరువుపొందిన వారికిగాని యివ్వకుండా బిగపట్టి ఉంచవలసిందగా లాహోరు ఇంపీరియల్ బ్యాంకుకు ఉత్తరవులను జారీచేయవలసిందని భారతప్రభుత్వమును కోరుటకు సంస్థాన మిలిటరీ ప్రభుత్వం నిర్ణయించినది పాకిస్తాన్‌లో గోధుమలుకొనుటకు హైదరాబాద్ కార్పొరేషన్ తరఫు ఏజెంటుకు చెల్లించవలసిందిగా పాకిస్తాన్‌లో నున్న ఇబ్రహింరజ్వీకి రూ 20 వేలు లోగడ పంపబడెను. ఆ మొత్తంలో నుండియే అతడు లాహోరు ఇంపీరియల్ బ్యాంకులో పై మొత్తమును డిపాజిటుగా నుంచెను. ఇబ్రహింరజ్వీ సాధారణమైన గుమాస్తాగిరీలో నున్నటువంటివాడు. లాయకాలీ వాయాంలో ఒక్క సంవత్సరంలో ఇతడు హైదరాబాద్ సంస్థానంయొక్క కాందిశీక పునరావాసశాఖకు డెప్యూటీ కార్యదర్శిగా నియమించబడెను. కాందిశీక పునరావాస సౌకర్యాలు పాకిస్తాన్ ఏ విధంగా చేయుచున్నదో పరిశీలించుటకు యితడు పాకిస్తాన్‌కు పంపబడెను. గోధుమలుకొనుటకై యితనిపరంగా పంపబడిన మొత్తంలో రు 2200 లను యితడు తన స్వంతంకింద వాడుకొనెను. మిగిలిన మొత్తమును ఇంపీరియల్ బ్యాంకులో తన పేరనే డిపాజిట్ చేసియున్నాడు.

## మొయిన్ నవాజ్ జంగ్ భవనం స్వాధీనం

హైదరాబాద్, నవంబరు 7: లాయకాలీ మంత్రివర్గంలో ఆర్థికశాఖ, విదేశవ్యవహారాలశాఖమంత్రిగాను, ప్రస్తుతం ఐక్యరాజ్యసమితి హైదరాబాద్ ప్రతినిధివర్గనాయకుడుగానున్న నవాబ్ మొయిన్ నవాజ్ జంగ్ కు హైదరాబాద్‌లోనున్న గృహమును మిలిటరీ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నదని తెలియుచున్నది. మిలిటరీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఎల్. సి. జైన్‌గారు యిప్పుడు ఆ భవనంలో నుందురు.

## ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి

లాయకాలీ మంత్రివర్గంలో రాజ్యాంగ వ్యవహారాలశాఖసభ్యుడుగానున్న నవాబ్ ఆలీయావర్‌జంగ్ ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా నియమించబడును. ఈ ఉద్యోగానికి యీతనిపేరు సూచించి లాంఛనంగా నిజాం నవాబు అనుమతికొరకు వేచియున్నారని అధికారవర్గాలద్వారా తెలియుచున్నది. లాయకాలీ మంత్రివర్గంలో సభ్యుడుగా నుండగా యితడు మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ బలవంతంమీద తన ఉద్యోగానికి రాజీనామా నిచ్చియుండెను. ఆఫ్రికా వివాదం విషయంలో ఐక్యరాజ్యసమితికి వెళ్ళిన ప్రథమ భారతీయ ప్రతినిధివర్గానికి యితడు సలహాదారుడుగా పనిచేసియుండెను.

## నిజాం పోలీసుబల పునర్నిర్మాణం

హైదరాబాద్ పోలీసుబల పునర్నిర్మాణం చురుకుగా జరుగుచున్నది. లాయకాలీ ప్రభుత్వకాలంలో కల్పింపబడిన అనవసరపు అనేక పోలీసు ఉద్యోగపదవులు రద్దుచేయబడినవి. అన్ని జిల్లాలలోను యిట్టి అనవసర పదవులు అనేకం లోగడ కల్పింపబడినవి. జిల్లాపోలీసు సూపర్నెంటు హోదాకుమించిన హోదాగల ఉద్యోగాలు 7 కల్పింపబడినవి. ఈ ఉద్యోగులు ప్రస్తుతం సెలవుమీద వున్నారు. వీరి విషయమై ముందు ఏమి చేయవలెనో యింకా నిర్ణయించలేదు. సంస్థాన సైన్యమును తగ్గించు విషయం ప్రస్తుతమునకు నిలిపివుంచిరి. సంస్థాన నివాసులై సంవత్సరంకంటె తక్కువ సర్వీసుకలిగివున్నటువంటి సైనికులు సైన్యంనుండి తొలగింపబడవలసినవారైనప్పటికీ ప్రస్తుతానికి తొలగింపబడరు. కాని హైదరాబాద్ నివాసులు కానటువంటివారిని, యితరులచే సైన్యంలో చేర్చుకోబడినటువంటివారిని సైనికులను మాత్రం సర్వీసు కాలంతో తొలగించెదరు. వీరు సంస్థానమునుండి నవంబరు నెలలోగా వెళ్ళిపోవలెను. ఎందుకు వివాహంకాని వారు నవంబరు 15 నాటికి వివాహమైనవారు కుటుంబాలతో నవంబరు 30 నాటికి వెళ్ళిపోవలెను.

## ప్రభుత్వ ఆయుర్వేద వ్యతిరేక దృక్పథం మార్పుటకు యత్నం

మచిలీపట్నం, నవంబరు 4: ప్రభుత్వపు ఆయుర్వేద వ్యతిరేక దృక్పథమును మార్చి ఆయుర్వేద అభ్యున్నతికి ఉద్యమించునట్లు చేయుటకును, ఆయుర్వేదాభివృద్ధికి భంగకరములగు చట్టములను మార్పించుటకును కృషి చేయునిమిత్తము ఒక ఉపసంఘమును చెన్నపట్నము పంపుటకు ఆంధ్ర వైద్యమండలి స్థాయిసంఘమువారు మొన్న మంగళవారమునాడు ఇచ్చట సమావేశమై తీర్మానించిరి. సమావేశమునకు డాక్టరు అ. విజయసారధి ఆచార్యగారు అధ్యక్షత వహించిరి. సమావేశ ప్రారంభములో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు రాష్ట్రపతిగ ఎన్నిక అయినందుకు అభినందన తీర్మానముచేసిరి. చెన్నపట్నం పంపెడి సంఘములో విజయసారధి ఆచార్య, వి. టి. వి. రామానుజస్వామి, ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులు, శిష్టా సుబ్రహ్మణ్యశాస్త్రి, ప్రకాశ చంద్ర శతపథి, చందు సుబ్బారావు, కె. కె. భట్టు, వినుకొండ హనుమాచార్యులు, గడ్డ సౌభాగ్యమ్మ, సయ్యద్ వజీరుద్దీన్ గార్లు సభ్యులుగ నియమితులైరి.

## మద్యపానం కింద నేరం

పొన్నూరు, నవంబరు 5: గత రాత్రి స్థానిక మద్యనిషేధ సబిన్స్‌పెక్టరు జోగారావు మద్యపానం చేసినందుకుగాను యిద్దరిని అరెస్టుచేసిరి.

## పరిషియా మంత్రివర్గం రాజీనామా

టెహెరాను, నవంబరు 7: పరిషియా మంత్రివర్గము గతరాత్రి తమ రాజీనామాలను చక్రవర్తికి అందజేసినని పరిషియను పత్రికలు నేడు ప్రకటించెను. పరిషియా ప్రధాని అబ్దుల్ హుస్సేను హజా హేరు గారు ఈ రాజీనామాలను అందజేసిరి. ఈ సంవత్సరము పరిషియా ప్రభుత్వము తయారుచేసిన ఆయవ్యయపట్టికను పరిషియా పార్లమెంటుసభ్యులు ఆమోదించుటలేదు. అందువల్ల ప్రభుత్వ వ్యవహారములు సాగక స్తంభించుచున్నది. ఆ కారణాలచేత ప్రస్తుత ప్రధాని రాజీనామా నిచ్చెను.

హజాహేరుగారి స్థానే తిరిగి ప్రధాన మంత్రి పదవిని స్వీకరింపగలవారెవరనే విషయమై షా చక్రవర్తి నేడు పరిషియా పార్లమెంటు అధ్యక్షుడగు సర్దారు సక్కీరు హెక్మత్‌గారితో మాట్లాడెను. మాస్కోలో పరిషియను రాయబారిగా నున్నట్టియు ఇదివరలో ప్రధానమంత్రిగా ఒకప్పుడు పనిచేసినట్టియు మహమ్మదు సయ్యదు మలాఘూ గారుగాని అజర్బయిజానులో ఇదివరకు గవర్నరుజనరలుగా నుండిన ఆ కామన్సూరుగాని ప్రధానిపదవికి రావచ్చునను చున్నారు.

హజాహేరు ప్రధానియొక్క మంత్రివర్గము అధికారంలోనికివచ్చి 5 మాసాలైంది. వీరి మంత్రివర్గం యెడల విశ్వాసములను ప్రకటించుతీర్మానము పరిషియా పార్లమెంటులో 3 రోజుల క్రిందనే చేయబడెను. అందువల్ల వీరు ఇంత అకస్మికంగా రాజీనామానిచ్చుట ఆశ్చర్యమును కలిగించుచున్నది.

## శ్రీ॥ శ్రీ॥ టి. ఎన్. మూర్తిగారు

బరంపురం, నవంబరు 3 యిచ్చటి కళింగవైశ్యకుటుంబానికి చెందిన ప్రముఖ వర్తకులు, ఉదారస్వభావులు అయిన శ్రీ టి. ఎన్. మూర్తిగారు హృద్రోగంవల్ల నిన్న సాయంత్రం తమ స్వగృహమున కాలధర్మమొందిరని చెప్పుటకు చింతిస్తున్నాము. (స్వ. వి.)

# చెన్నరాష్ట్రప్రభుత్వానికి నిజాం పౌరులకు ప్యాస్‌పోర్టులుఇచ్చే అధికారం

## హైదరాబాద్, భారత ప్రభుత్వాల మధ్య వివాదం పరిష్కారం.

హైదరాబాద్, నవంబరు 7: హైదరాబాద్ సంస్థాన ప్రజలకు పాస్‌పోర్టులను యిచ్చువిషయమై ఇండియా హైదరాబాద్ ప్రభుత్వముల మధ్య 2 సం॥ కింద ఏర్పడిన తగాదా తృప్తికరంగా పరిష్కరింపబడినది. మిలిటరి ప్రభుత్వ సిఫార్సు మీద హైదరాబాద్ పౌరులకు పాస్‌పోర్టులు యిచ్చుటకు చెన్నరాష్ట్ర ప్రభుత్వమునకు అధికారమివ్వబడినది.

ఈ యేర్పాటు ప్రథమంలో సంస్థాన శాఖచే సూచింపబడినది. కాని యిది సంస్థానసర్వస్వతంత్రాధికారానికిభంగకరమని హైదరాబాద్ ప్రభుత్వంచే త్రోసివేయబడినది. అయితే, యిందుకు ప్రత్యామ్నాయంగా ఏవిధమైన ఏర్పాటులు చేయబడకపోవుటచే విదేశాలకు వెళ్ళిన అనేకమంది సంస్థానపౌరులు, ప్రభుత్వోద్యోగులు పాకిస్తాన్ సప్లయిచేసిన పాస్‌పోర్టులమీద వెళ్ళియుండవచ్చును.

సంస్థానశాఖ ఉత్తర్వు ననుసరించి, ఐక్యరాజ్యసమితికి వెళ్లిన హైదరాబాద్ ప్రతినిధివర్గం సరియైన ప్యాస్‌పోర్టులమీద వెళ్లెనా లేక ఏదైనా విదేశాన్నుండి సంపాదించిన ప్యాస్‌పోర్టులమీద వెళ్లెనా అను విషయమును ప్రస్తుత ప్రభుత్వం దర్యాప్తు చేయుచున్నదని తెలియుచున్నది.

## 2000 మంది అపహృత స్త్రీలు

రజాకార్లు, పఠాన్లు, రోహిలాలు, మహారాష్ట్రి, రాజపుత్, నిమ్నజాతివర్గాలకు చెందిన 2000 మంది స్త్రీలను ఎత్తుకొనిపోవుట జరిగినదని హైదరాబాద్ సంస్థాన సహాయసంఘ దృష్టికివచ్చినది. ఈ స్త్రీలను వారు బలవంతంగా మతాంతరీకరణంచేసి వివాహం చేసుకొనిరి. దీన్ని గురించి గత ప్రభుత్వమునకు అనేకమంది చెప్పుకొన్నప్పటికీ వారిమొరను ఎవ్వరూ ఆలకించలేదు. హైదరాబాద్ సంస్థాన సహాయసంఘ కార్యదర్శి లక్ష్మినివాస్ గనేరివాల్‌గారు యీ స్త్రీలను, వారు ప్రస్తుతమున్న పరిసరములనుండి తొలగించి వారి భవితవ్యమును వారు నిర్ణయించుకొనుటకు వీలుగా, వారి వాస్తవ బంధువులతో పరిచయం కల్గించుటకు ఆ కాలం కల్గునట్లు, ప్రభుత్వ అజమాయిషీలోనుంచవలెనని చెప్పిరి.

## అధిక్షేపణ సంఘం

సంస్థాన కాంగ్రెసు హైకమాండుచే ప్రముఖులైనవారితో కూడిన అఖిల హైదరాబాద్ సంస్థాన కాంగ్రెసుసంఘ సభ్యులతో ఒక అధిక్షేపణసంఘంగా ఏర్పాటు చేయబడెను. సంస్థానకాంగ్రెస్ కార్యవర్గమువారి నిర్ణయమునకు వ్యతిరేకంగా ఆందోళన జరుపుటకుగాను యీ అధిక్షేపణసంఘం ఒక కార్యక్రమం తయారుచేయునని తెలియుచున్నది.

## కాందిశీక పునరావాస శాఖ సహాయ కార్యదర్శి

హైదరాబాద్ మిలిటరీ ప్రభుత్వ కాందిశీక పునరావాసశాఖ సహాయ కార్యదర్శిగా శ్రీమతి సుశీలాబాయి పథక్ నియమించబడెను. ఈమె నాగపూర్ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. డిగ్రీ పొందియుండెను. ఈమె లోగడ నిజాం ప్రభుత్వంలో రేషనింగ్ ఆఫీసరుగా పనిచేసియుండెను. లాయకాలీ ప్రభుత్వం యీమెను ఆ ఉద్యోగంనుండి తొలగించినది. మిలిటరీ ప్రభుత్వంలో కార్యదర్శిగా నియమించబడిన ప్రథమ మహిళ ఈమెయే. ఇంతేకాక గత యుద్ధంలో వలంటీరుగా పనిచేసినందుకుగాను నిజాం నవాబు బహూకరించిన ఖుస్రూయే దక్కన్ పతకమును పొందిన ప్రథమ మహిళకూడ యీమెయే.

## ఎన్నికలకమిషనరు పర్యటన

హైదరాబాద్ ఎన్నికల కమిషనరు ఎం. శేషాద్రిగారు మెదక్, మహబూబ్‌నగర్, రాయచూర్ జిల్లాలలో పర్యటించి ఆయా జిల్లాల సివిల్ పరిపాలనాధికారులతో రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరుపుటకు ముందు చేయవలసిన ప్రాథమిక కార్యకలాపములను గురించి చర్చించుటకుగాను రేపు బయలుదేరి వెళ్లెదరు.

## రామానందతీర్థ పర్యటన

సంస్థాన కాంగ్రెసు అధ్యక్షులు స్వామి రామానంద తీర్థగారు రేపు బయలుదేరి నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో నాలుగు రోజులపాటు పర్యటించెదరు. ఈ పర్యటన అనంతరం తీర్థగారు ఢిల్లీ పోయి సంస్థాన కాంగ్రెస్‌ను ఎదుర్కొనుచున్న సమస్యలను గురించి నెహ్రూ, పటేల్ గార్లతో సంప్రదింపులు జరిపెదరు.

## రజాకార్ అరెస్టు

జహీరాబాదులో ప్రముఖుడని పేరు పొందిన ఇబ్రహీం అను రజాకారు గత రాత్రి అరెస్టుచేయబడెను.





## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

1890 సంవత్సరపు ఇండియన్ రైల్వేస్ ఆక్టు IX లోని సెక్షన్సు 55 & 56 ప్రకారము వేలము అమ్మకపు నోటీసు.

రైల్వేకు యివ్వవలసిన యావత్తు చార్జీలు చెల్లించి కన్‌సైని ముందుగా డెలివరి తీసుకొనకపోయినచో, దిగువ సరకులు 21-11-48 తేది ఉదయం 11 గంటలకు మద్రాసు సాల్టుకొటార్సు వద్ద బహిరంగ వేలంలో అమ్మబడునని యిందుమూలముగా ప్రజలకు తెలియజేయడమైనది. కొనదలచినవారు సరకు మొత్తము గుంనిచెడ్లలు చూచి తృప్తిపడుటకుగాను సాల్టుకొటార్సు గుడ్సు ఏజంటుకు ముందుగా తెలియజేసి పనిగంటలలో సైనా సరకును పరీక్షించుకొనవచ్చును. అట్టి పరీక్షకు అనుమతి నివ్వవలసినదిగా సాల్టుకొటార్సు గుడ్సు ఏజంటుకు ఇన్‌స్ట్రక్షన్సు యివ్వడమైనది.

| | | |
|---|---|---|
| కన్‌సైన్‌మెంటు | — | ఇన్‌వాయిసు నెం. 189 of 25-9-48. |
| | | వాయిల్‌పట్టినుండి సాల్టుకొటార్సుకు, |
| | | 2 వాగనుల వంటచెరుకు. |
| ఇన్‌వాయిస్ తూకము | — | 800 మణుగులు. |
| పంపినవారు | — | ఎ. జె. మహమ్మద్ ఇబ్రహీం సేట్. |
| కన్‌సైని | — | సెల్ఫు. |
| షరతులు | — | నగదు చెల్లింపు. |

పాడిన తర్వాత వివరములలో లోటుపాట్లతో సహా ఏ కారణంవల్లగాని కొనుగోలుదారు వస్తువు చెల్లించకుండా ఉండడానికి, సరకు డెలివరి తీసుకోకుండా వుండడానికి వీల్లేదు.

మద్రాసు, 19-10-48.

ఆర్. జె. జె. పెర్రీ,
చీఫ్ కమర్షియల్ మేనేజరు.

# గానకళా పోషణ
## ప్రజానీకం బాధ్యత
### ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఉపన్యాసం

విజయవాడ, నవంబరు 4: 'ఏ దేశంలో లలితకళలు ఉచ్ఛస్థితిలో ఉంటాయో ఆ దేశమే సౌభాగ్య ఔన్నత్యాలు కలదని ప్రాజ్ఞులకు విశదమే. కనుక, ప్రజానీకం, తమ దేశ ఔన్నత్యాన్ని కాపాడుకోవాలంటే లలితకళలు నశించిపోకుండా, నిత్యాభివృద్ధి పొందుతూ ఉండేలాగు చూసుకోవాలి. తమపైగల ఈ గురుతర బాధ్యతను ప్రజలు ఎంత వేగంగా గుర్తిస్తే అంతసుఖం' అని శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారు నిన్నను స్థానిక హిందుస్థాన్ సంగీతమండలి చతుర్థ వార్షికోత్సవములకు అధ్యక్షతవహించుచు నుడివిరి. శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారు ఉత్సవములను ప్రారంభించిరి.

మండలివారు నాయుడుగారికి సన్మాన పత్రమును సమర్పించుచు సంగీతకళాసేవ ద్వారా తెలుగుజాతి ప్రతిభను చాటినారని నమోవాకాలు అర్పించిరి. అనంతరం శ్రీ నంగం నారాయణబాబు, అకిరాల సత్యనారాయణ, పోలవరపు రామచంద్రరావుగార్లు నాయుడుగారికి సంగీతంలోగల అశేషమైన సంపద, వారి ఫిడేలువాద్యంలోగల తియ్యదనంగూర్చి వ్యాఖ్యానిస్తూ ఉపన్యసించారు.

శ్రీ నాయుడుగారు యిట్లు ఉపన్యసించిరి:

అధ్యక్షత వహించడంలో ఉండే ఘనత కంటె మనదేశంలో ఇటువంటి సంగీత సభా వేశాల్లో నేనుకూడ పాల్గొనగలగడమే నాకు ఎక్కువ సంతోషాన్ని కలుగచేస్తుంది. పలు గానసభల్లో, కచేరీలు చెయ్యడం మూలాన్నైతే నేమి సంగీతసభల్ని నడిపించిన అనేకమందితో నాకు బాగా పరిచయం ఉండడం మూలాన్నైతే నేం, ఆంధ్రదేశంలోను, దక్షిణాదిలోను, అనేక గానసభల గురించి వాటి పరిస్థితులుగురించి నాకు కొంతవరకు తెలుసు. సంగీతసభలు ఉన్నత ఆదర్శాలతో స్థాపించబడు తున్నాయి. కాని ఆంధ్రదేశంలో కాకినాడ శ్రీ సరస్వతీ గానసభ తప్పితే తక్కిన గానసభలు నిరాటంకంగా రెండు దశాబ్దాలుకూడ నడవకపోవడం చాలా చింతించవలసిన విషయం. ఇలాంటి పరిస్థితికి ముఖ్యకారణం ఆర్థికబలం చాలకపోవడమేనని తెలుస్తుంది. ఈ ఆర్థికబలం ఏలా చేకూరేది వెంటనే ఆలోచించవలసిన అవసరంవుంది. పూర్వకాలం లలితకళలు ముఖ్యం గా సంగీతం మహారాజుల పోషణలో ఉంటూవచ్చింది. ఈనాడు ఈ ప్రజాస్వామ్యపు దినాల్లో దేశానికి ముఖ్యబలం ప్రజనించి చేకూరవలసిందే. ప్రజానీకం తనదేశాన్ని, దేశ స్వాతంత్ర్యాన్ని ఔన్నత్యాన్ని తనబలం చేత నిలబెట్టుకోవాలి. ఏదేశంలో నైతే లలితకళలు ఉచ్ఛస్థితిలో ఉంటాయో ఆ దేశంమాత్రమే సౌభాగ్యఔన్నత్యాలు కలది అని ప్రాజ్ఞులకు విశదమే కనుక తమ దేశ ఔన్నత్యాన్ని కాపాడుకోవాలి అంటే తమ లలితకళలు దేశంలో నశించిపోకుండా నిత్యాభివృద్ధిపొందుతూవుండేలాగు చూసుకోవాలి. నేడు తమపైగల ఈ గురుతర బాధ్యతని ప్రజానీకం ఎంత వేగం గుర్తిస్తే దేశానికి అంత సుఖం.

మన భారతదేశం లలితకళలకు పుట్టినిల్లు. లలితకళల్లోకల్లా అత్యుత్కృష్టమయినది సంగీతం. వేదకాలంనుంచి లక్ష్యలక్షణ సమన్వితమై దేశానికి ఏకైక సంగీతరీతిగా వుంటూ వచ్చింది. భారతీయ సంగీత లక్ష్య లక్షణములయొక్క నిర్దుష్టతను అనేక పాశ్చాత్యసంగీతశాస్త్రవేత్తలే ప్రశంసించారు. అయితే కొన్నిశతాబ్దముల క్రితం అన్యదేశీయ సంపర్కంవల్ల మనదేశ సంగీత లక్ష్యం కొంత మార్పుచెంది ఉత్తర దేశంలో హిందూస్థానీ సంగీతమని, దక్షిణాదిన కర్ణాటక సంగీతమని రెండు పద్ధతులుగా ఏర్పడింది. లక్ష్యాన్ని అనుసరించి లక్షణంకూడా తను మార్పును పొందడం సహజం. అందువల్ల ప్రస్తుతం రెండు సంగీత పద్ధతులు చాలావరకు వేర్వేరుగా వున్నాయి. అయితే ఏకళ అయితే తన ప్రధాన సాంప్రదాయానికి భంగం వాటిల్లకుండా అన్యసంప్రదాయాల్లోని విశిష్టతలను తనలో జీర్ణింపచేసుకొని తన మూలంగా తన ప్రాశస్త్యను పరిరక్షించుకోగలుగుతుందో, అదే సజీవకళ కాగలదు. అందుకోసం భారతీయ సంగీతంలోవున్న రెండు పద్ధతులు ఒకచోటకలసి విని, చర్చించుకొని గ్రహించవలసిన అవసరం ఎంతైనా వుంది. అలాంటి ముఖ్యావసరాల్ని ఆంధ్రదేశంలో యీ సంస్థ నాలాంటివారికి సిద్ధపరుస్తున్నందుకు హిందూస్థాన్ సంగీతమండలికి నా హృదయపూర్వక అభినందనాలు. ఈ లక్ష్యసిద్ధికై వారు చేస్తున్న ఏకైక కృషికి నా ప్రత్యేక అభినందనాలు.

రాజకీయాలకు సంగీతకళకు ప్రత్యక్ష సంబంధం లేనప్పటికి స్వతంత్రంకాని ఏ దేశంలోనూ కళలు రాణించవు అనేది అందరకు తెలిసిన విషయమే. దానికి మనదేశ చరిత్రేసాక్షి. అయితే మనం ఈ నాడు రాజకీయంగా స్వతంత్రులం అయినప్పటికి సుమారు రెండు శతాబ్దాల పరదేశీయ పరిపాలనవల్ల కలిగిన అనేక దౌర్భాగ్యాల ఫలితంగా దేశస్వాతంత్ర్యంవచ్చినా అనేక యితర రాజకీయపు ఇబ్బందులు ఉంటూనే ఉన్నాయి. మనదేశనాయకులు భావిభారతదేశాభ్యున్నతికి అనుకూలత విద్యా సంస్థల దేశాన్ని పలుముఖాల ప్రగతిపథాన్ని తీసుకుపోయే మార్గాలు వెతుకుతున్నారు.

ప్రస్తుతం మనకు కావలసినంత వరకూ సంగీత విషయంలో గమనిస్తే భారత ప్రభుత్వం ఉత్తర దేశంలో మాదిరి సంగీత కాళాశాలలను బలపరుస్తూ దక్షిణాన చెన్నపట్టణంలో సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కర్ణాటిక మ్యూజిక్ అనే సంగీత సంస్థను నెలకొల్ప దలచినట్లు యిదివరకే ప్రకటించారు. ఇది సంగీత విద్యార్థులకు విద్యాభిమానులకు సంగీతంలో కాని కంఠకేమాడ ఎంతో సూకావహమైన సంగతి. రాజకీయంగా అనేక యిబ్బందులకు లోనైవున్న రోజులు సరించి ముఖ్యంగా సంగీత విషయంలో తాము చూపదలచు కొన్ని ప్రోత్సాహానికి భారత ప్రభుత్వం మిక్కిలి అభినందనీయం. అయితే కేంద్రప్రభుత్వము అనుమతించి నప్పటికి మన రాష్ట్రప్రభుత్వము ఈ విషయమయి ఎంతశ్రద్ధ వహించినది తెలియ వలసియున్నది. ఈ సందర్భములో పని ప్రారంభించటానికి తాత్కాలిక సంఘాన్ని ఏర్పాటు చేశారన్న విషయము మించి ఏమిచేసినది ఏమి చేయబోతున్నది తెలియడంలేదు. మన రాష్ట్రప్రభుత్వం దీని విషయమయి ఎక్కువ శ్రద్ధతీసుకుని తాము ఏమి చేయబోయేదీ త్వరలో తెలియజేయగలరని ఆశిస్తున్నాను. ఈ ఇన్‌స్టిట్యూట్ దక్షిణదేశానికంతటికి ముఖ్యమైనది కావడంచేత సలహా సంఘాన్ని ఏర్పాటుచేయటం, విద్యావిధానము నిర్ణయించటం, మొదలయిన అనేక విషయాలను కమిటీవారు తగుశ్రద్ధతో పరిశీలిస్తారనికూడ ఆశిస్తున్నాను.

ప్రభుత్వం భాషాప్రయుక్త రాష్ట్రాల ఆవశ్యకతను గుర్తించి నిర్మాణానికి తగిన సన్నాహాలు జరుపుచున్నది. త్వరలోనే ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణము తథ్యము అని మన దేశనాయకులు పలువురు ఉద్ఘాటిస్తున్నారు. ఒక్కొక్క భాషకి ఒక్కొక్క గొప్పతనం, మార్దవం మధురత. స్వరాష్ట్ర పరిపాలనవస్తేనే స్వయం భాషా ఔన్నత్యాన్ని గుర్తించే అవకాశాలు ఉంటవి. కర్ణాటకసంగీతం తెలుగుభాషా దివ్య కుసుమంలో గేలిన తేనెయై చవులూరచేసింది. రాష్ట్రాలలో భిన్నభిన్నంగా ఉండే సంగీతసంఘాలు ఒక ఆంధ్ర గానకళాపరిషత్ అనే మాతృసంస్థక్రింద ఏర్పడి, మనకుండే బలాన్ని కూడగట్టుకుంటే అనేక మహోన్నత వృక్షమై సర్వ లాభిస్తుంది. ఈ లక్ష్యసిద్ధికోసం ఆంధ్ర దేశంలో ఉండే సంగీతసంఘాలు సభలు సంగీత విద్వాంసులు విద్యాపోషకులు విద్యాభిమానులు విద్యార్థులు ప్రతిఒక్కరు కలసి ఏకసంకల్పులై పనిచేయాలని కోరుతున్నాను.

మరొక్క సంతోషమైనసంగతి. వచ్చే డిసెంబరు ఒకటవ తేదీనుండి ఆంధ్రదేశంలో ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రం ఆరంభమవుతుంది. ఈ సందర్భంలో ఆంధ్రదేశంలోని సంగీతప్రతిభ సత్వరముగా అభివృద్ధి అయే లా సంగీతజ్ఞులకు తగిన ప్రోత్సాహం సహాకారం చూపించవలసిందని ఆలిండియా రేడియోవారికి మనవిచేసుకుంటున్నాను. ప్రజలు కేవలం స్థానిక ప్రోత్సాహము మాత్రమేకాక కళయందు నిమగ్నత ఉండకుండా, తగిన అర్హత లేకుండానే తమ లోపమూయిష్ట సంగీతప్రసార కార్యక్రమానికై అధికారులకు వత్తిడికలుగచేయవద్దనీ, యీ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోమనీ వినయపూర్వకంగా హెచ్చరిస్తున్నాను.

ఆంధ్రదేశంలో విజయవాడ ప్రత్యేక స్థానాన్ని పొందిఉంది. మున్ముందు ఆంధ్రరాష్ట్రంలో ప్రధానస్థానాన్ని అలంకరించబోతోంది. అనేకవిధాల ప్రాముఖ్యతగల యీ పట్నంలో సంగీతానికి ప్రజాదరణ ప్రజాపోషణ ప్రజాభిమానం పూర్తిగాఉంటుందని ఆశిస్తూ సంగీత సర్వతోముఖాభివృద్ధిని ఆకాంక్షించే యీ హిందూస్థాన్ సంగీత మండలి, అభివృద్ధిచెంది అనేక [illegible] విద్యార్థుల్ని ప్రోత్సహిస్తూ దినదినాభివృద్ధిగా కలకాలం వర్ధిల్లేటట్లు అనుగ్రహించమని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

### బుచ్చిరెడ్డిపాలెం ఫిర్కా రైతు సంఘం

బుచ్చిరెడ్డిపాలెం, నవంబరు 5: ఈ ఫిర్కా రైతులు అక్టోబరు 31వ సభాదేశమై చీమకుర్తి బలరామిరెడ్డిగారు అధ్యక్షుడుగ ఫిర్కా రైతు సంఘము ఏర్పాటు చేసికొనిరి. ఆహారపదార్థములపై కంట్రోలు పెట్టరాదని, వ్యవసాయాదాయముపై పన్ను విధించరాదని, గ్రామం కరణమునకు రూ 10/-లు నిర్ణయించవలెనని మొదలయిన తీర్మానములు చేసిరి.

# సర్కారు, రాయలసీమ జిల్లాలతో సమగ్రాంధ్రరాష్ట్రాన్ని సత్వరం నిర్మించాలి

## రాయలసీమ మహాజనసభతీర్మానం

### శ్రీబాగ్ ఒడంబడికను రాజ్యాంగ చట్టంలో చేర్చాలని సూచన

(స్వకీయ విలేఖరి)

అనంతపురం, నవంబరు 8: భాషా ప్రయుక్తరాష్ట్ర విభజన సూత్రమును ఆమోదించుచు, రాయలసీమ జిల్లాలతో కూడిన ఆంధ్రరాష్ట్రమును వెంటనే ఏర్పాటు చేయవలెనని, శ్రీబాగ్ ఒడంబడికలోని షరతులను దేశరాజ్యాంగ చట్టములో ఇముడ్చుటద్వారా ఆచరణలో పెట్టవలెనని నిన్నసాయంత్రమిచ్చట జరిగిన రాయలసీమ మహాజనసభవారు ఏకగ్రీవముగ ఒక తీర్మానము చేసిరి.

తీర్మానమును అనంతపురం పురపాలకసంఘ అధ్యక్షుడు శ్రీమాన్ పప్పూరి రామాచార్యులుగారు ప్రతిపాదించిరి.

రాయలసీమ అభివృద్ధి కమీషనర్‌గారు చేసిన సిఫార్సులను కార్యరూపంలో పెట్టవలెనని మేలరు. పైనరు ప్రాజెక్టుల నిర్మాణమునకు పూనుకొనవలెనని వ్యవసాయక కుటీర పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయవలెనని, ధాన్యపుశ్రమకు ప్రభుత్వం ధనసహాయం చేయవలెనని ప్రభుత్వమును కోరుచు మహాసభ తీర్మానము చేసెను.

కంట్రోళ్లు అమలుచేయరాదని, నిర్బంధ ధాన్యసేకరణకు పూనుకొనరాదని వేరొక తీర్మానము చేసిరి. మహాసభకు అనేకువేల ప్రజలు హాజరైరి. సభాకార్యక్రమము ప్రశాంతముగ జరిగెను. చి॥ సౌ॥ టంగుటూరి సూర్యకుమారి జాతీయగీతా కీర్తనంతో మహాసభ ముగిసెను.

### మహాసభ ప్రారంభ దృశ్యములు

అనంతపురం, నవంబరు 7: రాయలసీమ మహాసభ-రాయలసీమ మహాజనసభ; ఆంధ్రరాష్ట్రనిర్మాణము అవసరమా? రాయలసీమ అందులో చేరవలెనా వద్దా అను వాద వివాదములతో కరపత్రములతో నిండియుండిన అనంతపుర వాతావరణము నేడు ప్రశాంతమైనది. రాయలసీమ మహాజన సభను బహిష్కరించవలెనని బళ్లారిపత్రికల్లు, అనంతపురములోని విద్యార్థులు కొందరు మరికొందరు ఎంతప్రచారముచేసి, సభ జరుగబోదని పత్రికలలో అసత్యవార్త ప్రకటించినను వీరుకుండలపైబడిన ప్రతినిధులతోను వేనకువేల ప్రేక్షకులతోను నేడుమహాజనసభ అత్యుత్సాహములో జరుగుచున్నది. (పత్రికావార్తచదివి కొందరు త్రోవలోనే వెనుదిరిగి వెళ్ళిరని కూడ తెలిసినది) ఆహ్వాన సంఘంవారు చక్కని సకులు భోజన ఏర్పాట్లు గావించిరి.

రాయలసీమ జిల్లాల నుండియేగాక, నెల్లూరు జిల్లాలోని ఆంధ్రప్రాంతము నుండియును, బనగానపల్లె సంస్థానము నుండియు గూడ ప్రతినిధులు లరుదెంచిరి. కాని రాయలసీమ జిల్లాలోని శాసనసభా ప్రతినిధులు సమావేశమునకు రాలేదు.

ఉదయము సేవాదళవలంటీర్లును విద్యార్థులును పురవీధుల సంఖా-ప్రభాత సంకీర్తన మొనర్చిరి.

### పతాకోత్సవము

ఎనిమిది గంటలకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు పి. తిమ్మారెడ్డిగారు జాతీయపతాక ప్రతిష్ఠగావించిరి. సేవాదళ సభ్యులు వందేమాతర గీతాలాపనానంతరం ఆయన ఇట్లుపన్యసించిరి.

"మనమిపుడు స్వతంత్రనాయువులు పీల్చుచున్నాము. అంతర్జాతీయ సభలలో మన నాయకులు ఉపన్యసించుచు భారత జాతీయప్రభలు ప్రపంచమంతటా నింపుచున్నారు. గాంధిజీ ఆశయములే ప్రపంచశాంతికి శరణ్యములని ప్రకటించి దివ్యజ్యోతిని వెలిగించినాడు. హింసావాదములలో నాశనమగుచున్న పాశ్చాత్యజాతుల మన్యము మన ఆశయములు నందించి మన ఆనందమునకు పాత్రులైనారు.

మనము సంపాదించుకొన్న స్వాతంత్ర్యము ప్రజా సామాన్యానికి సంబంధించినదిగా సాగించుటకు మనము ప్రయత్నించవలసియున్నది. ధనవంతులు అనేకులైపునను, తెలివిపరులు మరియొకవైపునను ప్రజా సామాన్య జీవితాన్ని పాడుచేయుచున్నారు. వారి బారినుండి తొలగుటకు మనము కృషిచేయవలెను. ఈ త్రివర్ణ పతాకచ్ఛాయలలో అజ్ఞానమను శత్రువును నాశనముచేసి ఐక్యమును వృద్ధిచేసుకొని పురోగమింపగోరుచున్నాను.

ఇప్పుడు జనసామాన్యముపట్ల సానుభూతిపరులగు నాయకులుగాని, వారి సమస్యల విషయమై పత్రికలుగాని కనుబడుటలేదు. ప్రజా విశ్వాసమును పొందినవారిని పదభ్రష్టులచేయుట, కంట్రోళ్లు విధించి రైతాంగమును నొప్పిపెట్టించుట ఇట్టి కార్యక్రమములకు ప్రోత్సాహమిచ్చి పత్రికలు ప్రజా విశ్వాసమును గోల్పోవుచున్నవని హెచ్చరిస్తూ ప్రజాసమస్యలను సానుభూతితో విమర్శించి వారి అభివృద్ధికి ప్రయత్నింపవలెనని కోరుచున్నాను.

రాయలసీమలోని మనము రైతు కూలీ ప్రజాసామాన్యమునకుగూడ రాజకీయములలో భాగమున్నదని, మహాత్ముని కోరిక మేరకు పతితోద్ధరణ ప్రజాసేవయని గమనించి రైతు కూలీ ప్రజారాజ్య స్థాపనకు నడుముబిగించి పనిచేయగోరుచున్నాను.

వేలకొలది ప్రజలు ఇచట సమావేశమై తమ అభ్యున్నతికై మార్గములను యోచించుచుండగా కొంతమంది ఈ సభను జరుగకుండా భంగపరుప యత్నించుట గర్హనీయము. మేము మనహో రాయలసీమలో మగవాళ్లు లేరని కరపత్రాల ద్వారా సభకు అంతరాయము కల్పింప యత్నించినారు. ఈ దుష్ప్రచారమునకు సభా తీర్మానములును, ముందు కాలమును తగిన సమాధాన మీయగలవు. మహాత్ముని పేరు చెప్పుకొని ప్రజా జీవితమును కలుషముచేసి ప్రజా ద్రోహము చేయువారికి ఈ త్రివర్ణ పతాకముక్రింద స్థానము లేదని ప్రజలు ప్రతిజ్ఞ చేయవలెను. ఆర్. యస్. నాగేశ్వరరావుగారి వందనములతోను జన గణ మన గీతముతోను పతాక ప్రతిష్ఠాకార్యము ముగిసెను.

### విషయ నిర్ణయ సంఘసభ

9 గంటలకు విషయ నిర్ణయసంఘం సమావేశమయ్యెను. జిల్లాకు ఇరువదియుండి పంతున ప్రతినిధులు సమావేశమై ప్రతిపాదింపబడిన అనేక తీర్మానములపై చర్చ సాగించిరి. యం. కె. వి. రెడ్డి, పప్పూరి రామాచార్యులు, కంబుల ఓబుళరెడ్డి, చేగిరెడ్డి బాలిరెడ్డి, పి. తిమ్మారెడ్డి మొదలగు వారును జిల్లాలనుండి వచ్చిన ప్రతినిధులును అనేకతీర్మానములు ప్రతిపాదించిరి. ముఖ్యముగా కంట్రోళ్లు, ధాన్యసేకరణ కూడదనియు, ప్రాజెక్టులు నీటివసతులు, విద్యుచ్ఛక్తి ఏర్పరచి వ్యవసాయాభివృద్ధికి మార్గము లాలోచింపవలెననియు, పరిశ్రమాభివృద్ధికి పూనుకొనవలెననియు, వీటిని కార్యరూపములో నుంచుటకు కొంత నిధిని ఏర్పరచి పూనుకొనవలెననియు వచ్చిన ప్రతిపాదనలు ముఖ్యమైనవి. భాషారాష్ట్ర సూత్రమంగీకరించుచు ఇతర భాషా రాష్ట్రములవలె క్లిష్టము లేనందున ఆంధ్రరాష్ట్ర నిర్మాణము తక్షణము కల్గించి శ్రీబాగ్ ఒడంబడికలోని షరతులను శాసనములో ఇమిడ్చి అందులోని మండలవారీ సమాన సంఖ్యా ప్రాతినిధ్యము అంగీకారముకానిచో కనీసము పదిఏండ్లవరకైనా ఈ ప్రాంతమునకు 75 వేల కొక ప్రాతినిధ్యమునిప్పించునట్లు చట్టబద్ధము చేయవలెనని ఒక తీర్మానము శ్రీ రామాచార్యులవారు ప్రతిపాదించిరి. దానిపై పలువురు ప్రసంగించిరి.

ఆర్థికాభివృద్ధిపై అనేకమంది తీర్మానములు ప్రతిపాదించిరి. వీటన్నిటిని సమన్వయ పరచి మహాసభయెదుట నుంచుటకు ఒకసబ్‌కమిటీ ఏర్పాటు చేయబడెను. అందులో జిల్లాకొక ప్రతినిధియు. కార్మికుల కొక ప్రతినిధియు నియమింపబడిరి.

ప్రతినిధులు చాలమంది తీర్మానములపై తమ యభిప్రాయములు వెల్లడించిరి.

### ఆహ్వానసంఘాధ్యక్షుని స్వాగతోపన్యాసం

ఆహ్వానసంఘ అధ్యక్షులు కె. వి. వేమారెడ్డిగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చుచు యిట్లు నుడివిరి.

"రాయలసీమ ఐశ్వర్యవంతంగా నుండినట్టు చరిత్ర తెలుపును. అట్టి ఔన్నత్యస్థితినుండి రెండు శతాబ్దములుగా ఆర్థికంగా అతిహీనస్థితికి గురి అయినది. ప్రకృతి మాత్రము అపారమైన ఖనిజసంపద నిచ్చినది. బంగారు, వజ్రాలు, ఇనుము, ఆభ్రకము, ముగ్గురాళ్లు, రాయలసీమలో ఎక్కువగా దొరుకును. రాయలసీమ అభివృద్ధికి ఎన్నో అవకాశాలున్నవి. భారీ పరిశ్రమలు నడుపుటకు అవసరమైన ఖనిజములు, ఇతర ముడిపదార్థములు వున్నవి. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వములవారు రాయలసీమ ఆర్థిక, సాంఘిక అభివృద్ధికి దోహదమివ్వలేకపోయినది. శాసనసభలలో రాయలసీమ ప్రతినిధులు ఏమియు చేయలేకపోతున్నారు. చిన్న పెద్ద ప్రాజెక్టుల నిర్మాణమునకు ప్రభుత్వమువారు యేలాటి చర్య తీసుకోలేదు. మనలో రాజకీయ చైతన్యము కలుగలేదు. ఆందోళన తక్కువ.

ఈ పరిస్థితిని తొలగించి రాయలసీమ ఆర్థిక సమస్యను పరిష్కరించుటకు, క్షామ నివారణకు ఆర్థిక ప్రణాళిక తయారుచేయుటకు, కార్యక్రమాన్ని శరవేగముతో నెరవేర్చుటకు ఈ మహాజనసభ యేర్పాటు చేయబడినది.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి రాయలసీమ వ్యతిరేకమనియు, ప్రత్యేకరాష్ట్రం కావలెననియు కొందరు విపరీతవాదం చేయుచున్నారు. తెలుగు వారందరము, సువిశాలమైన ఆంధ్రరాష్ట్రంలో ఏక కుటుంబముగా కాపురము చేయవలెనని నా విజ్ఞప్తి."

### ప్రారంభోపన్యాసం

మహాసభను ప్రారంభించుచు శ్రీ పప్పూరి రామాచార్యులుగారిట్లు నుడివిరి.

"రాయలసీమ తెలుగుదేశము కాదనియు, శ్రీ కృష్ణదేవరాయలు తెనుగువాడు కాదనియు వాదించుట హృదయావిదారకము. రాయలు గౌరవంచేతనే 1928 లో నంద్యాలలో జరిగిన దత్తమండల మహాసభలో యీ మండలమునకు రాయలసీమ యని నామధేయం చేయబడినది. కాని ఆంధ్రదేశమునకు రాయలసీమ భిన్నమైనదని వాదించువారు ఉందురని అప్పుడు భావించబడలేదు. నిజాంనవాబుచే తూర్పు ఇండియా వర్తక సంఘానికి యివ్వబడిన యీ మండలములు పలుచోట్ల దత్తమండలములని పేర్కొనబడుచుండుటచే అది అసహ్యంగా తోచి పేరు మార్చబడినది. నాటి దత్తమండల సభాధ్యక్షత వహించిన శ్రీ కె. కోటిరెడ్డిగారే పలుమారు ఆంధ్ర మహాసభకు అధ్యక్షత వహించి నాడును నేడును ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి కృషి చేయుచున్నారు. కావున రాయలసీమ నామకరణం ఆంధ్రులలో విభాగములు ఏర్పరచుటకు వారినుండి విడిపోవుటకు చేసిన కుతంత్రంకాదు. ఆంధ్రవిశ్వవిద్యాలయ కేంద్రము అనంతపురమునకు గాక దూరమున ఉన్న విశాఖపట్నానికి గొంపోబడుటవలన మనకు కోపతాపా లుదయించినమాట వాస్తవము. మనకేకాదు దీని కొరకు కాంక్షించిన బెజవాడ రాజమహేంద్రవరం వారికికూడా ఆగ్రహం కల్గినది. అప్పుడు రాయలసీమవాసుల కోరిక పై రాయలసీమ మదరాసు విశ్వవిద్యాలయంలో చేర్చబడినది. అయినప్పటికీ మదరాసు విశ్వవిద్యాలయంలో రాయలసీమ ప్రాతినిధ్యము అల్పము.

5 సం॥లలో ఆంగ్లభాష నంతరింపచేయవలెనని కేంద్రప్రభుత్వ విద్యాశాఖ మంత్రి ప్రకటించియుండెను. ప్రాంతీయ భాషయే ప్రధాన భాషయైనప్పుడు మనవారు తెనుగునే పఠింపక తప్పదు. తెనుగు నేర్చుకొని తమిళరాష్ట్రములోనో, కన్నడ రాష్ట్రములో ఉండుటయు అసంభవమే.

కావున భాషారాష్ట్రములే ఏర్పడినప్పుడు మనము ఆంధ్రరాష్ట్రము లో నుండక తప్పదు. వేరువేరు భాషలు మాటాడువారు ఒక రాష్ట్రమున నుండుట ఆ సిద్ధాంతానుసారము పొసగదు. కాని ఒకేభాష మాటాడువారు రెండు రాష్ట్రములుగా నుండుట తప్పుగాదు. వీలైనచో రాయలసీమ ప్రత్యేకరాష్ట్రముగా నుండవచ్చును. కాని కన్నడులను మనము చేర్చుకోజాలము. అది వారి కష్టనయము. వారు మనలో చేరనూ చేరరు.

శిథిలమైన హంపిని పునరుద్ధరించి దాని చుట్టు మండలములను రాయలసీమలో చేర్చి ఆంధ్రకర్ణాటక రాష్ట్రముగా చేయవలెనను వికటయూహ బళ్లారి ప్రముఖునికి కలిగినది. ఇది పగటి స్వప్నమువంటిదే. దీనికి రాయలసీమవాసు లంగీకరించినను కన్నడులు దీనినంగీకరింపరు. బళ్లారి మండలములో సగము కన్నడ ప్రదేశమని అంగీకరించక తప్పదు. ఇంక మిగిలిన విచిత్తూరితో కలిసి నాలుగున్నర జిల్లాలు. చిత్తూరి నాయకులు, శ్రీ అనంతశయనం గారి నాయకత్వమున భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన నిమిత్తమేర్పడిన కమిషన్ సభ్యుల ఎదుట సాక్ష్యమిచ్చుచు ఆంధ్రరాష్ట్రములో తాము చేరుట కంగీకరించుటయేగాక, సత్వర రాష్ట్ర నిర్మాణము జరుగవలెననియే కోరిరి. ఈ సభ నలంకరించిన బళ్లారి ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రమున కనుకూలురేగాని వ్యతిరేకులుగారు.

ఈ నాలుగున్నర జిల్లాలును ఏకమై ఒక ప్రత్యేక రాష్ట్రమును నిర్మించుకొనగోరినను అది సాధ్యముకానిపని. ఏమన మన ఆదాయ వ్యయములు పరిశీలించి నచో ప్రభుత్వమునకు వ్యయమే ప్రజలిచ్చు పన్నులకంటే అధికముగా నున్నది. స్వయం పోషణమునకే చాలని ఆదాయముతో క్షామములనెట్లు నివారింపగలము. ప్రాజెక్టులనెట్లు నిర్మింపగలము. ప్రజలకు విద్యనెట్లు కల్పగలము? కావున ఆర్థికముగా పరిశీలించినను మనము ఆంధ్రరాష్ట్రమున చేరుటయే శ్రేయస్కరము లాభకరము.

ఉత్తర సర్కారులవారికిని, రాయలసీమవాసులకునుగల అభిప్రాయభేదము లల్పములు. ఎట్లయినను ఉభయుల మధ్యన ఒక ఒడంబడిక ఉండుట మేలని 1938 లో ఉత్తరాంధ్ర నాయకులును రాయలసీమ వాసులను కొందరమును శ్రీబాగు ఒడంబడికను చేసికొన్నాము. దానిని ఆంధ్రమహాసభయేగాదు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు గూడ ఆమోదించినది.

అప్పుడూరకున్న బళ్లారి ప్రముఖులు కొందరు తర్వాతనొకానొక కారణముగా ఆంధ్రనాయకులతో కలహించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణ వ్యతిరేక ప్రచారము సాగించుటకు రాయలసీమ మహాసభను స్థాపించిన విషయము మీ రెరుగుదురు. రాయలసీమాభివృద్ధియే ఆ సభోద్దేశమని ప్రకటింపబడినను దాని మరుగున ఉపలక్షితమైనది ఆంధ్రరాష్ట్ర నిర్మాణ వ్యతిరేకత. ఆసభా ప్రముఖులు శ్రీ బాగ్ ప్యాక్టును వెక్కిరించిరి: దానిలో సంతకములు పెట్టినవారి ప్రాతినిధ్యమును ఆక్షేపించిరి.

వాస్తవమునకు నంద్యాలసభలో విధిలేక ఈ బళ్లారి రాయలసీమసభా మహానాయకులు శ్రీబాగు ఒడంబడిక అంగీకరించిరేగాని ఇష్టముండికాదు. సెప్టెంబరు నెలలో భాషారాష్ట్ర సంఘం ఎదుట సాక్ష్యమిచ్చుచు ఈ బళ్లారి ప్రముఖులు నంద్యాల తీర్మానమును గూడ లెక్కింపక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము కూడదని సాక్ష్యమిచ్చిరి. అంతేకాకుండ ఆంధ్రులమీద కసితో చెన్నపట్టణము అకవలదే కావున వారికే ఇచ్చివేయవలెనని సాక్ష్యము చెప్పిరి. అందువలన రాయలసీమ కెంత నష్టమో వారు గమనింపలేదు. భాషాప్రయుక్తరాష్ట్రములు దేశమునకు చెడుపని వారు మరియు. ఒరిస్సా, సింధు రాష్ట్రములు వేరైనందున భారత జాతీయత కేమికీడు మూడినదో వారు చెప్పరు.

హైదరాబాదు సమస్య పరిష్కరింపబడువరకు రాష్ట్రనిర్మాణము కూడదని కొందరు రాయలసీమ శాసనసభ్యుల సంతకములు గల ఒక విజ్ఞాపనము కమిషను వారికి ఇయ్యబడినది. కాని దానిని వారిచ్చిన వారము దినములలోనే హైద్రాబాదు సమస్య తేలిపోవుటవలన ఆ కుతంత్రము పనిచేయలేకపోయెను. ఇప్పుడింక వారికి కాశ్మీర సమస్య శరణ్యమైనది. అదియును పరిష్కరింపబడినచో యింకే సమస్యను పట్టుకొందురో!

రాయలసీమ మహాసభవారును శ్రీబాగ్ ఒడంబడిక నొప్పుకొనిరిగదా ఇంక ఈ మహాజనసభ ఏలనని కొందరు ప్రశ్నించుచున్నారు.

ఈ మహాజనసభ ఏర్పరచినవారి యుద్దేశ్యముగూడ శ్రీబాగ్ ఒడంబడిక మేరకు ఆంధ్రరాష్ట్ర మేర్పడవలెననియే. కాని ఆ ఒడంబడిక రాయలసీమవాసులను ఉత్తరాంధ్రులను ఏకము చేయుటకు ఒక వంతెనగా నుండగలదని ఈ సభవారి అభిప్రాయము.

భాషారాష్ట్ర నిర్మాణము మహాపాపకార్యమను వాదముతో దానిని అన్ని మార్గములను నిరోధించుటకు ప్రయత్నించి విఫలులైనంతట నుండు శ్రీబాగు ఒడంబడికలతో దానిని నిబంధించి ఒల్లని అంగీకారముతో ఒప్పుకొనుట ఆ మహాసభవారి ఆలోచన. భాషారాష్ట్రములు లత్యావశ్యకమైనవి. వానిని వెంటనే నిర్మించుట ప్రజలకు లాభకరము. కాని వనకబడిన రాయలసీమవారు ఉత్తరాంధ్రులతో కలసి నడచుశక్తి సంపాదించుటకు ఈ ఒడంబడిక సాహాయ్యకారిగా నుండగలదని ఈ మహాజనసభవారి ఆలోచన, ఇందులో ఏపద్ధతి సకలాంధ్రులకును శ్రేయస్సును గూర్చునో ఏది మనకు లాభదాయకమో ఈ సభవారు నిర్ణయింతురుగాక.

### కమ్యూనిస్టు అరెస్టు

విజయవాడ, నవంబరు 6: హైదరాబాదు సంస్థాన కమ్యూనిస్టు ప్రముఖులలో నొకరగు పి. సి. రెడ్డి వెంకటపతిని ఎం. ఎల్. థామస్‌గారు అరెస్టుచేసిరి.

### బళ్లారిజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుని రాజీనామా

బళ్లారి, నవంబర్ 6: ఈజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు టేకూరు సుబ్రహ్మణ్యం గారు తమ పదవికి రాజీనామా నిచ్చిరి.

## గంటల పంచాంగం

సర్వధారి నం॥ కార్తీక శు॥ అష్టమి 1948నం॥ నవంబరు 9 మంగళవారం మం॥ అష్టమి ప 11-23 ధని రా1-38 శు. శు॥ నవమి నవంబరు 10 బుధవారం ...నవమి ప 1-56 ...రా 4-38 వర్జ్యం ప 8-44 ల11-33 కు.

ఆంధ్రపత్రిక

సర్వధారి నం॥ కార్తీక శు॥ అష్టమి మంగళవారం

# రష్యా కర్తవ్యము

అగ్రరాజ్యములు రెండువర్గములుగ విడిపడుటయే గాక, ఉభయవర్గములు ప్రపంచమునందలి ఇతరరాజ్యములను తమ అదుపులో నుంచుకొనుటకు చతుర్విధోపాయములను ప్రయోగించుచున్నట్లు ప్రాక్, పశ్చిమ యూరపు లందలి రాజకీయ పరిణామములు స్పష్టము చేయుచున్నవి. ఉభయులు మరొక ప్రపంచ సంగ్రామము నివార్యమనుచు, సంగ్రామమునకు సన్నద్ధమగుచున్నట్లు ఆయాదేశముల సైనికవ్యయమును పరిశీలించిన స్పష్టమగుచున్నది. ఐక్యరాజ్యసమితి రాజకీయ ఉపసంఘము ఆయుధసంక్షేపమునకు సంబంధించిన రష్యా ప్రతిపాదనమును చర్చించినపుడు, అమెరికా, బ్రిటన్, రష్యా ప్రతినిధులు ఈవిషయమై పరస్పరము నిందించుకొనిరి. గతవారము సోవియట్ రాజ్యస్థాపన వార్షికసందర్భమున విదేశాంగమంత్రి మాలటాఫ్, యుద్ధకాలమున రష్యా సేనానిటి ముట్టెంకొని తమదేశము శాంతిని కాంక్షించుచు అట్టి శాంతిస్థాపనకు ఇతరులు విఘ్నములు కల్గింప సాధ్యముగాకుండ చేయుటకు తమ సైనికబలమును వృద్ధిచేసుకొనుచుంటిమని ప్రకటించిరి.

బ్రిటన్, అమెరికా ప్రభుత్వ ప్రతినిధులును ఇంచుమించు ఇదే విధముగ ప్రకటించుచుండిరి. అగ్రరాజ్యములు అన్నియు తమ యుద్ధనిర్వహణశక్తిని క్రమముగ వృద్ధిచేసుకొనుచుండెననుటకు ఇంతకు మించిన నిదర్శనములు అవసరములేదు. బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికాలకు, రష్యాకు ఇటీవల ఏ ఒక్క విషయమునందను సమాధానము కుదిరియుండలేదు. గతవారము ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశము "అగ్రరాజ్యములు తమ విభేదములను పరిష్కరించుకొనుటకు ద్విగుణీకృత శక్తితో పని చేయవలెను" అను మెక్సికో తీర్మానమును ఏకగ్రీవముగ ఆమోదించుటవలన అగ్రరాజ్యముల విభేదము లెంత తీవ్రముగ నున్నవో ఎంత ప్రమాదకరముగ నున్నవో స్పష్టమైనది. కాని ఆ విభేదములు సమితి తీర్మానముల వలన పరిష్కారము కాజాలవు. భారతప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ సమితి సర్వసభ్య సమావేశమునందు ఈ అంశమును స్పష్టము చేయుచు అసలు స్పర్థములందు మార్పు రావలెననియు హింసా, ద్వేషములు పరిత్యజించి లక్ష్యములకేగాక, లక్ష్యసాధనములకును అత్యంత ప్రాధాన్యమిచ్చి ఉన్నతలక్ష్యసాధనకు, ఉత్కృష్ట మార్గములు ననుసరింపవలసినదని హెచ్చరించియుండెను.

కాని అమెరికా అధ్యక్ష ఎన్నికల సందర్భమున ట్రూమన్ చేసిన ప్రకటనలను వారిఅధ్యక్ష ఎన్నిక ప్రచారకనుగాని, సోవియట్ రష్యా జన్మదిన ఉత్సవసభలందు మాలటాఫ్ టిమొషెంకోల ఉపన్యాసములుగాని పరిశీలించిన ఉభయవర్గములకు నాయకత్వము వహించిన అమెరికా, రష్యాల వైఖరి, దృక్పథము, విధానముమార్పు చెందక, పూర్వపు గాడినే సాగుచున్నట్లు స్పష్టమగుచున్నది. ప్రస్తుతము రష్యా అనుసరించుచున్నది, ప్రపంచమంతట వ్యాపింప చేయుచున్నది, కమ్యూనిజమైనను, లేక ప్రసిద్ధ ఆంగ్ల రచయిత విశాంస్టైన్ వ్యాఖ్యానించినట్లు అది 'క్రెమ్లినిజం' అయినను, ఆ సిద్ధాంతమును సర్వత్రా ప్రతిఘటించుటకు ట్రూమన్ అధ్యక్షుడు ప్రమాణము తీసుకొనెను. కనుక అమెరికా ప్రభుత్వము ఆ ప్రమాణపాలనకు లేసుకొను ప్రతి ఒక్కచర్యను ప్రతిఘటించుటకే గాక, అట్టి ప్రయత్నములను భగ్నముచేయుటకు కూడ రష్యా దీక్షతో యావచ్ఛక్తిని వినియోగించి పనిచేయుచున్నది. వీరు ఇదేవిధముగ పనిచేసిన యుద్ధము నివార్యమని ఆశించుట సాధ్యము గాదు.

గుణాత్మకమైన ప్రయోజనకరమైన రక్షణాచర్యయని విశ్వసించి సోవియట్ రష్యా ఈ దశాబ్దారంభమునుండి తన ప్రాపకప్రాంతమును క్రమక్రమముగ విస్తరింపచేసుకొనుచున్నది. 1939 కి పూర్వము జర్మనీ ఇదేవిధానమును అనుసరించెను. ప్రపంచమందలి దాదాపు అన్ని దేశములందును నాజీపక్షము తన పంచమాంగదళమును ఏర్పాటు చేసుకొనెను. అందుకు సామ్రాజ్యవాదము అధికముగ తోడ్పడినది. నేడు రష్యాకు అంతకంటె విస్తృతమైన, శక్తివంతమైన పంచమాంగదళము అన్ని దేశములందుగలదు. ఇటీవల చైనా అంతర్యుద్ధమునందు కమ్యూనిస్టులు సాధించిన విజయములు సోవియట్ పంచమాంగదళ శక్తి సామర్థ్యములు వెల్లడించుచున్నది. ఇంతటి శక్తి వారికి కలుగుటకు కారణములను చాంగ్ కైషేక్ ప్రభుత్వ పరాజయము వెల్లడించుచున్నవి. ప్రజాస్వామికముపేరిట అమెరికా ప్రతిదేశమునందును ఒకవర్గముచు-అది అధికసంఖ్యాక వర్గమని నిర్ధారణ చేయుట సాధ్యముగాదు- బలపరచుచుండెను. అమెరికాసహాయముతో ఈ వర్గములు ప్రతికూలవర్గముల నణచివేయుటకు ప్రయత్నించుచుండెను. లేకున్న జపాన్ యుద్ధము పరిసమాప్తమైన మూడు సంవత్సరముల అనంతరముకూడ ఆసియాయందు దాదాపు అన్ని దేశములందును భారీఎత్తున సాయుధసంఘర్షణలు జరుగవలసిన అగత్యము లేదు. ఈ పరాధీన రాజ్యములు, పీడితవర్గములు సహజముగ తమ శత్రువును ఎదురించువారినెడ అభిమానముకలిగియుండును. రష్యా అభిమానదేశములన్నియు కమ్యూనిస్టు రాజ్యములని కనుక ప్రజాస్వామిక వ్యతిరేక దేశములని భావించుటకు వీలుగాదు. బ్రిటన్ అమెరికాలు మాత్రము ఈ సత్యమును గుర్తింపక "క్రెమ్లినిజం"ను ప్రతిఘటించుటకు హ్రస్వదృష్టితో సంకుచిత విధానముల ననుసరించుచుండెను.

సైనికవర్గములు మాత్రమె యుద్ధమును ప్రోత్సహించుచనని బ్రిటీషుకన్సర్వేటివ్ పక్షము, అమెరికన్ రిపబ్లికన్ పక్షము స్పష్టము చేసినది. ఉభయులు అధికారభ్రష్టులగుచుండగ, శాంతి ఒకింత బలిసిలు కుదరక పూర్వమె తృతీయసంగ్రామము ఆరంభమగు కొంతకాల ప్రమాదము నివార్యమైనది. శాంతిసాధనకు ప్రయత్నించుటకు మరికొంతవ్యవధి లభించినది. రష్యా అమెరికాలు ఈ వ్యవధిని ఎట్లు ఉపయోగించుకొందురనే విషయము పైననే ప్రపంచశాంతి ఆధారపడియున్నది. రష్యా ప్రప్రథమముగ తన రహస్య రాజ్యాంగ తంత్రమును విసర్జించి హృదయపూర్వకముగ అభ్యుదయ శక్తులతో సహకరించుటకు సిద్ధముకావలెను. అప్పుడె రష్యను అధికారుల ప్రకటనలు వారి నిగూఢ శాంతికాంక్షను వెల్లడించుచున్నవని, వారు ఏరసామ్రాజ్య నిర్మాణమునకు కృషి చేయుటలేదని యావత్తు ప్రపంచము విశ్వసించి రష్యాతో సహకరింపగలదు.

## ప్రపంచశాంతిసాధనకు సమష్టిమానసికచికిత్స

పారిస్, నవంబర్ 7: ప్రపంచములో శాంతిని సాధించుటకుగాను వివిధజాతులు, మతములు, దేశముల మధ్యగల విద్వేషములను విరోధములను అంతరింప చేయుటకు ముగ్గురు మానసిక శాస్త్రవేత్తలు సమష్టి మానసిక చికిత్సలను కొత్తపద్ధతిని ప్రయోగించవలెనని యత్నించుచున్నారు. వీరు ముగ్గురూ ఐక్యరాజ్యసమితి విద్య, ఆర్థిక సభ్యతాసంఘములో సభ్యులు. మానసిక శాస్త్రవేత్త ఓ. ఎల్లియట్. మార్టిన్ (ఇంగ్లండ్) డా॥ యస్. చంద్రశేఖర్ (భారతదేశం) సమష్టి మానసిక శాస్త్రవేత్త డా॥ క్లైన్స్‌బర్గ్ (అమెరికా) డా॥ చంద్రశేఖర్‌గారు ఈ సంఘముయొక్క లోకవిషయ సంగ్రహణ (డెమొగ్రాఫిక్) శాఖాధ్యక్షులు.

వ్యక్తులలోని ఉద్వేగములు, ఇతరమానసిక దౌర్బల్యములు ఎట్లు జీవితమును భగ్నము చేయునో, అట్లే వివిధజాతులు, మతములు, దేశములమధ్య పరస్పర అనుమానములు, విద్వేషములు, విరోధములు ప్రపంచశాంతిని భగ్నపరుమనని వీరు చెప్పుచున్నారు.

అయితే వ్యక్తులలోని మానసిక దౌర్బల్యములకు మూలహేతువులైన ఈ మానసములు సందేహములు, విద్వేషములు కేవల భ్రమప్రాయములైనట్లే వివిధజాతులు, దేశములమధ్యనుండా పరస్పర విద్వేషములు నిరాధారములైనవి. వ్యక్తులలోని మానసిక దౌర్బల్యములకు, మానసిక చికిత్సచేయు రీతినే ప్రపంచశాంతికి భంగకరమైన హేతువులను పరిశీలించి చికిత్సచేసి శాంతిని సాధించవచ్చునని ఈనిపుణుల అభిప్రాయం. వ్యక్తుల దౌర్బల్యములను, మూలహేతువులను కనుగొనుటకు మానసిక శాస్త్రవేత్తలు వ్యక్తులను పలువిధములైన ప్రశ్నలు వేసి పరిశీలించెదరు. ఇట్లే విరోధములలో మునిగియున్న వివిధదేశములలోని ప్రజల అభిప్రాయములను, మానసిక ప్రవృత్తిని పరిశీలించవలెను. హిందువులను గురించి మహమ్మదీయులకు గల అభిప్రాయమేమో వారిపట్ల సందేహములేవో, మహమ్మదీయులను గురించి హిందువుల అభిప్రాయమేమో కొన్ని ప్రశ్నలను ప్రచురించి ప్రజాభిప్రాయములను తెలుసుకొనవచ్చును.

ఇట్లే శ్వేతవర్ణులు, నీగ్రోలమధ్య విద్వేషకారణములను, యూదులు, అరబ్బులమధ్య విద్వేషకారణముల, పాశ్చాత్య ప్రాచ్య ప్రభుత్వముల మధ్యను గల విరోధకారణములను పరిశోధించవచ్చును. ఈ పరస్పర అనుమానములు, విద్వేషముల హేతువులేవో అట్లు తెలుసుకొన్న తరువాత, అవి యెంత నిరాధారములో నిరూపించవచ్చును. ఈ రీతిగా అంతర్జాతీయ సమస్యలకు చికిత్సచేయవచ్చునని ఈ నిపుణుల అభిప్రాయం. ఉదాహరణకు భారతదేశ విభజన, దాంపత్య జీవనములోని సమస్యలను వివాహ విచ్ఛేదము ద్వారా ఎట్లు పరిష్కరించజాలరో అట్లే దేశవిభజన భారతదేశములోని సమస్యలను పరిష్కరించజాలకపోయిందని డా॥ చంద్రశేఖర్ గారు చెప్పిరి. ప్రపంచములో శాంతికాముకులైన నూటికి 90 వంతులు ప్రజలలో యుద్ధభీతిని పోగొట్టుటకు ఇది యుక్తసాధనమని ఈ నిపుణుల అభిప్రాయం.

## ప. బెంగాలులో కమ్యూనిస్టుల అరెస్టు

కలకత్తా, నవంబరు 7: పశ్చిమ బెంగాలు పోలీసులిన్ని ఇంకో 10 మంది కమ్యూనిస్టులను అరెస్టుచేసిరి; ఈ రాష్ట్రములో ఇంతవరకు మొత్తం 50 మంది కమ్యూనిస్టులు అరెస్టుచేయబడినారు.

# భారతపత్రికల బాధ్యతలు

## పండిత నెహ్రూ డా॥ పట్టాభి ఉద్బోధలు

న్యూఢిల్లీ, నవంబరు 7: భారత ప్రజలను ప్రోత్సహించుటలోను, ప్రజాభిప్రాయమును రూపొందించుటలోను దేశమునందలి పత్రికలు ప్రధాన పాత్ర వహించవలసియున్నదని ఢిల్లీ దేశభాషా పత్రిక 'తేజ్' రజతోత్సవ సందర్భమున ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూగారు చెప్పిరి. ఈ ఉత్సవమునకు గవర్నరు జనరలు, మంత్రులు, నూతన రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు, మున్నగు మహాశయులనేకులు వచ్చిరి. డా॥ రాజేంద్రప్రసాద్, డా॥ పట్టాభి, సర్దార్ పటేల్, కొంతమంది గవర్నర్లు పత్రికా సంపాదక సభాధ్యక్షుడు శ్రీ దేవదాస్ గాంధీ, షేక్ అబ్దుల్లా మున్నగువారు సందేశములంపిరి.

భారతపత్రికయందలి ప్రముఖ ఘట్టములో పత్రికా యజమానులు పత్రికా సంపాదకులు నిర్వర్తింపవలసిన బాధ్యతలను పండిత నెహ్రూగారు జ్ఞాపకంచేసిరి. ప్రజలను ప్రబోధించుటకును, ప్రజాభిప్రాయమునకు రూపొందించుటకును పత్రికలు చేయవలసిన సంసేవ కలదని ఆయన చెప్పెను. బాధ్యతారహితముగా వ్రాతలు వ్రాయుటవల్ల ప్రపంచములో మన మాతృదేశముయొక్క గౌరవప్రతిష్ఠలకు భంగము కలుగుననిరి.

భారతదేశము విషయమై ప్రపంచాభిప్రాయమును గూర్చి ప్రస్తావించుచు ప్రధాని యిట్లనిరి: "భారతదేశము మహత్తరమైనదేశము. భారతదేశమునకు చేకూరిన ప్రస్తుత ప్రతిపత్తికి కారకులము మనము కాము. భారతదేశముయొక్క ప్రాచీన ఘనత, నాగరికత దానికి ప్రతిపత్తి చేకూర్చినవి. జాతిజనకుడగు గాంధిమహాత్ముని కృషివల్లగూడ దేశమునకు ప్రతిపత్తి చేకూరినది. మూఢనిష్ఠాపూరితములు వ్రాతలు వ్రాయుపత్రికలు తమ దేశమునకే అపకీర్తిమైన హానిచేయుచున్నవి. ముఖ్యముగా పత్రికా యజమానుల, సంపాదకుల హ్రస్వదృష్టికల్ల నే యిట్లుజరుగుచున్నది."

కాంగ్రెస్ మహాసభాధ్యక్షులుగా ఎన్నుకొనబడిన డా॥ పట్టాభి సీతారామయ్యగారు హిందుస్థానీభాషలో ఉపన్యసించుచు ప్రభుత్వ విధానమును విమర్శించుటలో పత్రికారచయితలు నియమనిగ్రహములు చూపవలెననికోరిరి. ఇప్పుడు పత్రికలబాధ్యతలు హెచ్చినవని, బ్రిటిషు పరిపాలనలో పత్రికలకుండిన బాధ్యతలకంటె యిప్పుడు వానిబాధ్యతలు యొక్క గొప్పని, భారమైనవియని నూతన రాష్ట్రపతి చెప్పెను. ఆ. ప్రె.

## ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక

పారిస్, నవంబరు 7: ఉత్తర అట్లాంటిక్ సముద్రానికి ఇరుప్రక్కలాఉన్న బ్రిటన్, ఫ్రాన్సు, హాలండ్, లక్జెంబర్గ్, బెల్జియం, అమెరికా, కెనడాలు కలిసి సంయుక్త రక్షణఒడంబడికను చేసుకొనుటకై జరిపే సమావేశానికి ఇంకా తేదీని నిర్ణయించినట్లు లేదని కెనడా విదేశాంగ మంత్రి లెస్టర్ పియర్సన్ నేడిచ్చట అభిప్రాయమును వెల్లడించెను. కెనడారక్షణ మంత్రి బ్రూక్ క్లాక్స్టన్ నిన్న ఒటావాలో మాట్లాడుతూ ఈ సమావేశం వాషింగ్టన్‌లో జరుగగలదని చెప్పియుండెను. ఈ సమావేశం 1949 సం॥ ప్రారంభంలో జరగునని ఆశ్చిజ్ఞవర్గాలు భావిస్తున్నట్లు నాయిటర్ రాజకీయవిలేఖరి తెలియజేస్తున్నాడు. అమెరికా అధ్యక్షుడుగా ట్రూమన్ తిరిగి ఎన్నికఅయినందువల్ల సమావేశం అనుకున్న దానికన్నా త్వరగా జరుగగలదని తెలుస్తున్నది.

## గ్రీకు నావికుల ఉరి నిలుపుదల

ఏథెన్స్, నవంబర్ 7: ప్రభుత్వమునకు వ్యతిరేకముగా విద్రోహచర్యలు జరిపినందులకై ఉరితీత విధింపబడిన గ్రీకు నావికులపై శిక్షను అమలుజరుపుట వాయిదా వేయబడినదని గ్రీకుప్రభుత్వం నేడు ప్రకటించినది. వీరిపై దయచూపవలెనని ఐక్యరాజ్యసమితి రాజకీయ సంఘంలో నిన్న రాత్రి ప్రతిపాదించబడినవిమీదట ఈ నిర్ణయము చేయబడినట్లు ప్రకటించబడినది.

ఈ నావికులపై దయచూపవలసినదని బ్రిటిష్ పార్లమెంటుసభ్యులు 22 మంది నేడు గ్రీకురాజుకు విజ్ఞప్తి చేసిరి. కేవలం మానవ సౌజన్యముచేతనే. ఈ 22 మందిలో 21 మంది కార్మికపక్షంవారు. ఒకరు స్వతంత్ర కార్మిక సభ్యుడు. ఈ నావికుల విషయమై బ్రిటిష్ విదేశాంగశాఖ జోక్యం కలిగించుకొనక నిరాకరించినందులకై గడచిన ప్రక్కవారంనాడు బ్రిటిష్ శాసనసభలో సభ్యులు నిరసనను ప్రకటించి ఉండిరి.

# నెహ్రూ ప్రభృతులకు కాంగ్రెస్ పక్షాభినందన

1 వ పేజీ తరువాయి

యులకు ఉన్నన్ని హక్కులు ఉండవు కాని నాలావరకు పౌరసత్వపుహక్కులన్నీ వారికి ఉండగలవు. అదేవిధంగా భారత రిపబ్లిక్ ప్రజలకుకూడా ఇతర కామన్వెల్తు దేశాలలో పరిమిత పౌరసత్వ హక్కులు ఏర్పడగలవు.

కామన్వెల్తులోని దక్షిణాఫ్రికా, మొదలైన అధినివేశాలలోను, వలసరాజ్యాలలోను భారతీయులు అనేకమంది ఉంటున్నందువల్ల ఈ ప్రతిపాదన భారతదేశమునకు ఉచితముగానే కనిపించు అవకాశం ఉన్నది. (యు. ప్రె.)

## ఫిలిప్‌నోయెల్ బేకర్ ప్రసంగం

కేంబ్రిడ్జి, నవంబర్ 7: లండనులో జరిగిన కామన్వెల్తు ప్రధానుల సమావేశము "శాంతి, ప్రజాస్వామ్యము, స్వాతంత్ర్యము" ఇవియే ఇకముందు విజయము గాంచగలవనుటకు గొప్ప తార్కాణమని బ్రిటిష్ కామన్వెల్తు శాఖామంత్రి నోయెల్ బేకర్ నేటిరాత్రి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ యూనియన్‌లో మాట్లాడుచు ఉద్ఘాటించెను.

లండను సమావేశములో పాల్గొన్న ప్రధానులు 55 కోట్లమంది ప్రజలకు ప్రతినిధులుగా నిలబడిరని చెప్పుచు ఫిలిప్ నోయెల్ బేకర్ ఇట్లా అన్నాడు.

"పశ్చిమ యూరప్ సమాఖ్యనుగూడ మనము సాధించగలిగినచో అది మరొక 40 కోట్లమందికి ప్రాతినిధ్యము వహించును, అట్లాంటిక్ సముద్రాన్ని కూడా దాటి మన స్నేహం విస్తరిస్తే మరొక 20 కోట్లమంది ప్రజలుకూడ మనతో చేరుదురు. ఈ విధంగా శాంతికీ, ప్రజాస్వామ్యమునకూ, స్వాతంత్ర్యమునకూ వెనుక ఎంతపెద్దబలమున్నదో తెలియుచున్నది. ఇవన్ని మనము సాధించగల మనుటకు కామన్వెల్తు ప్రధానుల సమావేశము నిదర్శనముగా నున్నది."

## ఆస్ట్రేలియా ప్రధాని ప్రకటన

సిడ్నీ, నవంబర్ 7: "బ్రిటిష్ కామన్వెల్తు దేశాలమధ్య కనిపిస్తున్న సహకారభావం ప్రపంచంలోని అతి ప్రధానాంశాలలో ఒకటి." అని ఆస్ట్రేలియా ప్రధాని చిప్లే నేడు రేడియోలో ప్రసంగించుచు చెప్పెను.

"బ్రిటిష్ కామన్వెల్తుతో ముఖ్యమైనది దాని స్వరూపముకాదు. స్వాతంత్ర్యం, మానవమర్యాదలు, శాంతి ఆర్థిక సహకారం అన్న ముఖ్యాంశాలపై కామన్వెల్తు దేశాలలోగల ఏకాభిప్రాయము, సహకారమునే బ్రిటిష్ కామన్వెల్తులో ముఖ్యంగా గమనించదగిన అంశములు. కామన్వెల్తు అభివృద్ధినిగురించి ప్రజలేమీ ఆందోళన పడనక్కరలేదు. పూర్తిగా బ్రిటిష్ దేశము లయిన బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలండ్‌లు, చాలాభాగం ఫ్రెంచి, డచ్చి ప్రజలు ఉన్న కెనడా, దక్షిణాఫ్రికాలు, బ్రిటిష్ సంబంధము ఏర్పడుటకు ముందే విశిష్ట నాగరికతగల ఇండియా, పాకిస్తాన్ సింహళం మొదలైన వివిధరకముల దేశములు అత్యంత సన్నిహిత సంబంధాలు కలిగి ఉండటమే కామన్వెల్తుయొక్క విశిష్టత," అని ఆయన ప్రకటించెను.

## బ్రిటిష్ సింహాసనంతో ఇండియాకు పరిమిత సంబంధం?

న్యూయార్క్, నవంబర్ 7. ఇండియా కామన్వెల్తులోనే ఉండటానికి ఒకమార్గము కనిపెట్టబడినదని 'హెరాల్డ్ ట్రిబ్యూన్' పత్రిక లండన్ విలేఖరి వ్రాయుచున్నాడు. కామన్వెల్తు దేశాల సంబంధమునకు బ్రిటిష్ సింహాసనము నే ముఖ్యసూత్రముగా నుంచు విషయమై ఆలోచించకుండానే భారతరాజ్యాంగపరిషత్తు తన నూతన రిపబ్లికన్ రాజ్యాంగమును చర్చించుననీ, రాజ్యాంగము ఆమోదింపబడిన మీదట ఇండియా, బ్రిటన్, ఇతర కామన్వెల్తు దేశాలు అన్నీ కలిసి, భారత రిపబ్లిక్ అధ్యక్షునకు విదేశ వ్యవహారాలలో బ్రిటిష్ రాజప్రతినిధిగా భావించబడునని ప్రకటనచేయుననీ, అతడు వ్రాస్తున్నాడు. బ్రిటిష్ సింహాసనంతో ఇండియాకు సంబంధం కలిపే కామన్వెల్తు సభ్యత్వం ఇచ్చుటకు ఈ ప్రకటన మాత్రమే చాలుననీ, ఇతర ఒడంబడికలు, రాజ్యాంగ సూత్రాలు అవసరం లేవనీ భావించ బడుచున్నట్లు ఆవిలేఖరి వ్రాస్తున్నాడు.

"ఆ ప్రకటన మాత్రమే చాలు. ఇక ఇతర ఒడంబడికలు చేసుకొనుటగానీ, భారత రాజ్యాంగములో మార్పులు చేయుటగానీ అవసరంలేదు. దానివలన ఇండియా ఒక రిపబ్లిక్ గానే ఉంటుంది కాని అధినివేశం కాజాలదు. బ్రిటిష్‌రాజు ఇప్పటివలె కామన్వెల్తులోని ప్రతిదేశానికీ రాజుగా సెంచబడక, కామన్వెల్తు అనేరాజ్యానికి అధిపతిగా భావించబడును.

కామన్వెల్తు ప్రధానుల సమావేశం బ్రిటిష్‌వారు ఆశించిన దానికన్నా ఎక్కు-

# రామపాదసాగరం

## రెండు మూడేండ్లవరకు శంకుస్థాపన జరుగనేరదు

మదరాసు, నవంబరు 7: గౌ॥ ఎం. భక్తవత్సలంగారు, మదరాసు పబ్లిక్ వర్క్సుశాఖ మంత్రిగారు నేడు సాయంకాలం డిల్లీనుండి విమానంలో వచ్చిరి. అచట ఇండియా ప్రభుత్వం వర్క్సుశాఖ మంత్రి గాడ్గిల్, ఆర్థికశాఖమంత్రి డా॥ జాన్ మత్తయిగార్లతో రామపాదసాగర్ స్కీముగూర్చి చర్చించిరి. ఈ స్కీము త్వరలో కేంద్రప్రభుత్వం ప్రయారిటీసు (ఏది ముందు ఏది వెనక అని) నిర్ణయించే ఉపసంఘంవారు త్వరలో చర్చింతురనియు, వెంటనే మంజూరు అగునని ఆశించుచున్నామనియు తెలిపిరి.

డిల్లీలో వీరు బర్మా సింహళములందు భారతీయులగూర్చి గూడ చర్చించితిమనియు, 8, 9 తేదీలందు డిల్లీలో యీ విషయమయి జరుగు సభకు ప్రధాని ఓ. పి. రా. రెడ్డిగారు, ఆర్థికమంత్రి కె. గోపాలరెడ్డి, కామరాజ నాడారు గార్లు హాజరగుదురనియు చెప్పిరి.

### ఢిల్లీ సంప్రదింపుల ఫలితం

మదరాసు, నవంబరు 8: రామపాదసాగరం ప్రాజక్టు శంకుస్థాపన యింకను రెండుమూడేండ్లవరకు జరిగే అవకాశం లేదని డిల్లీలో గతవారం జరిగిన సంప్రదింపుల ఫలితంగా ప్రభువులు అభిప్రాయపడుచున్నారు. కేంద్రప్రభుత్వ మంత్రులు, మదరాసు మంత్రులు డిల్లీలో 4 వ తేదీ దీనిగూర్చి సంప్రదించిరి. కేంద్ర ప్రభుత్వం వారికి యిపుడున్న వ్యయంవల్లనే, యితర సమస్యలు యిబ్బందులవల్ల, యీ స్కీము మొదటి వర్షాలలో యిద్దామనుకున్నంత సహాయం యివ్వలేరని తేలింది. మదరాసు ప్రభుత్వంవారు యీస్కీముకి 129 కోట్లు ఖర్చునని, నూటికి 8 వంతు లాభం ఉండునని తెలిపిరి. కేంద్ర ప్రభుత్వంవారు మరికొన్ని వివరాలడిగిరి. అవిపంపినాక, ఉభయ ప్రభుత్వాల ఉత్తరప్రత్యుత్తరాలు సంప్రదింపులు ముగిసినగాని, ముందుకార్యక్రమం కానసాగదు. ఈలోగా కేంద్ర ప్రభుత్వంవారి ప్రయారిటీ ఉపసంఘంవారు దీన్నిగూర్చి విచారింతురు. మదరాసు ప్రభుత్వ మంత్రులు భక్తవత్సలం, కళావెంకట్రావు, ఛీఫ్ ఇంజనీరు యీ చర్చలో పాల్గొనిరి. ప్రధాని రెడ్డిగారు, ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు. హాజరు కాలేక పోయిరి.

మధ్యరాష్ట్రప్రభుత్వ ప్రతినిధులు బస్తరు ప్రతినిధులు కూడా యీచర్చలో పాల్గొన వలసియుండెను. కాని మదరాసు ప్రభుత్వంతో సంప్రదింపులు ముగిసినాక, కేంద్రప్రభుత్వం వారు మాత్రం వారితో సంప్రదించి, తెలియ జేతురని ఆప్తజ్ఞాన వర్గాల ద్వారా తెలియుచున్నది.

శ్రీ కళా వెంకట్రావు 9 తేదీ సాయంకాలం మదరాసు వచ్చును.

## తుంగభద్ర ప్రాజక్టు

మదరాసు, నవంబరు 8: మదరాసు మంత్రి ఎం. భక్తవత్సలంగారు ఢిల్లీనుండి వచ్చినాక, మాప్రతినిధి ప్రశ్నింపగ, తుంగభద్ర ప్రాజక్టును గూర్చి, హైదరాబాదు నుండి వచ్చిన 'వార్త సరికాదని చెప్పిరి. డిల్లీలో కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులతో సంప్రదించినపుడు, హైదరాబాదు ప్రతినిధి యిదివరకు ఒడంబడిక ప్రకారం ఎడమప్రక్క భాగం వారు నిర్మించుకొనుచే సూచించినని సూచించెను. హైదరాబాదు పరిస్థితులు మారినందున, డాము నిర్మాణం ఒకరి పెత్తనంలోనే జరుగుట మంచిదని మదరాసు ప్రతినిధులు చెప్పిరి. ఇండియా మంత్రి మదరాసు ప్రతినిధులతో ఏకీభవించిరి. ఈ చర్చ ఫలితంగా, ఇక ముందు నిర్మాణ కార్యమంతా మదరాసు ఛీఫ్ ఇంజనీరుచే పెత్తనంక్రింద జరిగి, హైదరాబాదుకి చెందిన సగభాగానికి హైదరాబాదు సూపరింటెండింగు ఇంజనీరు, మదరాసు భాగానికి మదరాసు సూపరింటెండింగు ఉద్యోగి ఉండి పనిచేయుచుందురు. ఉభయ ప్రభుత్వాలకు భిన్నాభిప్రాయం కలిగినపుడు పరిష్కరించుటకు సెంట్రలుబోర్డు ఏర్పాటు చేయబడెను. అందు ఇండియా ప్రభుత్వం వర్క్సుశాఖ ఉన్నతోద్యోగి ఒకరు, మదరాసు ఛీఫ్ ఇంజనీరు, హైదరాబాదు ఛీఫ్ ఇంజనీరు సభ్యులుగ నుందురు.

విజయప్రదంగా ముగిసినది. అన్నిటిలోకీ భారత ప్రధాని పండిత నెహ్రూ మహోన్నతమైన వ్యక్తిత్వమును ప్రదర్శించి మిక్కిలి ప్రాధాన్యత వహించెను. బ్రిటిష్ ప్రధాని ఆటిలీతో ప్రధానులతో జరిపిన దీర్ఘచర్చలలో ఇండియన్ రిపబ్లిక్‌ను కామన్వెల్తులో ఉంచుటకు పై మార్గము కనుగొనబడెను," అని ఆ విలేఖరి వ్రాసెను. (యు. ప్రె.)

# చాంగ్ కైషేక్ రాజీ ప్రయత్నం

(1-వ పేజీ తరువాయి)

యుద్ధరంగంలోని సేనానులకు విశేషాధికారాలను ఇవ్వటానికి అంగీకరించగలడు.

(8) ప్రస్తుతం చైనా విదేశ వ్యాపారాన్నంతా—ముఖ్యముగా సినిమాలు, ఇతర పరిశ్రములను— గుత్తకు తీసుకున్నట్లుగా వ్యవహరిస్తున్న చైనా ధనిక కుటుంబాల పట్ల తను చూపుతున్న ఆదరణను ఉపసంహరించుకోగలడు. (అ. యు. ప్రె.)

యెల్లో నదికి దక్షిణాన చైనీస్ ప్రభుత్వము పాడుగాటిగోడవలె నిర్మించిన తన సేనా వ్యూహములో రెండుచోట్ల కొంచెం ఖాళీలు వదిలిపెట్టారు. ఈ ఖాళీలగుండా కమ్యూనిస్టులు పురోగమించే సమయంలో వారిని ఆ ఇనుపతెరలోవలె నొక్కివేయవచ్చునని ప్రభుత్వసేనల ఉద్దేశ్యం. కాని కమ్యూనిస్టు సేనలు ఈ ఖాళీలను సునాయాసంగా దాటి దూసుకుని పురోగమించిరి.

నైరృతి హోనాన్‌లోనిసాన్యాంగ్ ను, అనహ్వేలోని ఫెంగ్‌టాయ్‌ను కమ్యూనిస్టులు ఆక్రమించి, దాదాపు 250 మైళ్లుగల రంగంలో యుద్ధచర్యలు జరుపుచున్నారనీ కూడ తెలియుచున్నది. ఫెంగ్‌టాయ్ చైనా రాజధాని నాన్‌కింగుకు 140 మైళ్లు మాత్రమే దూరముగా ఉన్నది.

గోరుచుట్టుపై రోకటిపోటు లాంటి, ఈ ఎదురు దెబ్బల వార్తలు వచ్చేసమయానికి జనరల్ చాంగ్‌కైషేక్ తన రాజధానిలో ఏవో రహస్యచర్చ లింకా జరుపుతూనే ఉన్నాడు. చైనీస్ ప్రభుత్వము ఉంటుందో, ఊడుతుందో ప్రస్తుతయుద్ధ ఫలితాలవలన తెలిసిపోగలదు.

మధ్య చైనాలో ఉన్న 6 లక్షల మంది కమ్యూనిస్టు సేనలకు జనరల్ చెన్ యీ, చెంకెంగ్, ఏ... శ్రేణు జైన ల్యూపోచెంగ్ అధిపతులుగా ఉన్నారు.

దక్షిణ షాంటుంగ్ రాష్ట్రంలో పీపింగ్-నాన్‌కింగ్ రైల్వే వెంబడి ఉన్న విశాల భూభాగంలో కమ్యూనిస్టుల భయంకర దాడులకు ప్రభుత్వసేనలు విచ్చిపోక ఇంకా నిలిచియే ఉన్నవని తెలియుచున్నది.

హోపేరాష్ట్రపు మైదానాలలో జరుగబోయే ప్రచండ యుద్ధానికి ప్రభుత్వసేనాని ఫుట్సోయీ సైన్యములను ఆయత్తపరచుచున్నాడు.

ఇటీవల నాన్‌కింగుకు వచ్చివెళ్లిన దాని ఫలితంగా ఉత్తర చైనా కంటకీ ఇతడు నియంతృత్వాధికారములు సంపాదించెను.

షాన్సీ రాష్ట్రపు రాజధాని తాయ్‌యువాన్‌కు ప్రమాద పరిస్థితిని తప్పించుటకు జనరల్ ఫుట్సోయీ విమానాల ద్వారా క్రొత్త సైన్యములను పంపించెను. అమెరికానుండి వచ్చిన క్రొత్త మిలిటరీ సామగ్రిని సేనలకు ఇచ్చుచు, ప్రాత సామగ్రితో పౌర సైన్యములను ఈతడు సమీకరించుచున్నాడు.

చైనా శాసనసభలోని కొందరు సభ్యులు నేడు "ప్రభుత్వమును సరియైన పద్ధతులలో పునర్నిర్మింపవలెనని అంతర్జాతీయ కమ్యూనిజమ్‌తో పోరాడుటకు, పసిఫిక్ ప్రాంతమును రక్షించుటకు అమెరికాతో నూత్న మిత్రత్వమును నెలకొల్పుకోవలెననీ" ప్రకటించిరి.

షాంఘైలో ఆకలితో మలమలమాడే ప్రజాసమూహాలు బియ్యపు దుకాణాలపై విరుచుకు పడుచుండగా, వారిని కరిమి వేసి నిమిత్తం నేడు తెల్లని శిరస్త్రాణధారులైన రక్షకభటులు వారిమీదకు పంపబడిరి.

ఒకనూల యాంగ్‌స్టీ సమీపంలో యుద్ధమేఘాలు ప్రచండంగా ఉరుము తుండగా, షాంఘైలో అర్థవిహీనంగా పెరిగిపోయే ధరల పరిస్థితి ప్రజల జీవితమును దుర్భరము చేయుచున్నది.

## షాంఘైపై తిరిగి అమెరికాకు ప్రత్యేక హక్కులు?

వాషింగ్టన్, నవంబరు 7: షాంఘై నగరమును కమ్యూనిస్టులనుండి రక్షించినచో, దానిపై అమెరికాకు 1942 కు పూర్వం ఉండే ప్రత్యేకాధికారములు, హక్కులు తిరిగి ఇచ్చివేసెదనని చాంగ్‌కైషేక్ చేర మాడినాడనుమాట సర్వాబద్ధమని అమెరికన్ విదేశాంగశాఖ ప్రతినిధి ఒకడు నేడు ఖండించెను.

బ్రిటన్, అమెరికా, మరికొన్ని ఇతర రాజ్యాలు తమకు షాంఘై, టీంట్సిన్, హాంకౌ నగరాలపై గల హక్కులను 1942 లో తిరిగి చైనాకు అప్పజెప్పినవి.

చెన్నపట్నం, నవంబరు 8: ఈ వాళ ఉదయం ఎగ్మూరు ట్రాముషెడ్డు దగ్గర యిరువైపులనుండి నడుస్తున్న రెండు ట్రాముబండ్లు ఢీకొన్నవి. ఆ బండ్లలోనొకదాని మెట్టుమీద నిలిచియుండిన ట్రాముకంపెనీ కూలివాడు రప్పడు అనువాని కాళ్లు చక్రముక్రింద తగులుకొని నలిగిపోయెను. వాడు ఆసుపత్రికి చేరిన రెండు గంటలలో అక్కడ మరణించెను.

# 20వ తేదీ బాంబుప్రయోగానికి 30వ తేదీ హత్యకు ఎట్టిసంబంధమూ లేదు

## —గాడ్సే

(1-వ పేజీ తరువాయి)

భావలో మొదటి ముద్దాయి నాథూరామ్ వినాయక్ గాడ్సే తానే గాంధీజీని హత్యచేసితినని ఒప్పుకుంటూ, కోర్టులో నేడు ఒక సుదీర్ఘమైన వాఙ్మూలమును దాఖలుచేసెను.

గాంధీజీని తాను కావలెనని కాల్చిచంపితినని ముద్దాయి అంగీకరించెను. వాఙ్మూలం టైపులో 68 ఫుల్‌స్కాప్ పేజీలుపట్టింది. ఏ పరిస్థితులలో ఏవిధంగా తాను గాంధీజీని హత్యచేసిందీ ముద్దాయి ఈ నివేదికలో పూసగుచ్చినటు వర్ణించెను. తాను చేసిన పాతకానికి గాడ్సే ఏమాత్రమూ పశ్చాత్తాపపడటంలేదని, వాఙ్మూలంలోని ఈక్రింది మాటలవల్ల విదితమవుతున్నది: "నా చర్య అనేకమంది విమర్శలకు గురి అయినది.

కాని నైతిక దృష్ట్యా నేను చేసిన దాంట్లో అవంతయైన తప్పులేదనే ఇప్పటికీ నేను అభిప్రాయపడుతున్నాను. ఇతరుల విమర్శలు నా ఈ అభిప్రాయాన్ని ఇంచుకయైన సడలింపజేయలేకపోయినవి. భవిష్యత్ చరిత్రకారులు నా చర్యయొక్క విలువను సంపూర్ణంగా గుర్తించగలరని నేను విశ్వసించుచున్నాను." సావర్కారు చేతులలో గాడ్సే యెటు తిప్పితే అటు తిరిగే కీలుబొమ్మ అని ప్రాసిక్యూషన్ న్యాయవాది అన్న మాటలను ఖండిస్తూ గాడ్సే ఇలా అన్నాడు:

### సవర్కార్‌కు తెలియదు

"గాంధీజీని నేను చంపబోతున్నానన్న విషయం వీర సావర్కారుకు ముందుగా తెలియదు. గాంధీ, నెహ్రూ, సుహ్రావర్దిలను హతమార్చవలసిందని వీర సావర్కారు ఆజ్ఞాపించాడని నేనుగాని ఆప్టేగాని బడ్గేతో ఎప్పుడు అనలేదు; ఇది ప్రాసిక్యూషన్‌వారు చేసిన అద్భుత కల్పన. హత్యాప్రయత్నం చేయడానికి ముందు బడ్గేను నేను వీర సావర్కారు ఇంటికి తీసుకొని వెళ్లాననీ, సావర్కారు మమ్మల్ని కృతకృత్యులై తిరిగి రావలసిందని ఆశీర్వదించాడనీ, అప్రూవర్ చెప్పిన మాటలు యథార్థంకాదు. మా హత్యాప్రయత్నం ఫలించి తీరుతుందని నేనుగాని ఆప్టేగాని బడ్గేతో ఎన్నడూ అనలేదు. ప్రైవేటు పనికి ఉపక్రమించడానికి ముందు పెద్దల ఆశీర్వాదాలు తీసుకోవాలన్న మూఢనమ్మకం నాకు ఏకోశానాలేదు. జోస్యాలమీద శకునాలమీద నమ్మకం పెట్టుకొనేటంత అవ్యక్తుణ్ణి కాను నేను." తన స్వతంత్ర వివేచనా శక్తిని, కార్యదక్షతను శంకించడం తనకు చాలా అవమానం అని చెబుతూ, గాడ్సే ఇలా అన్నారు:—నా కార్య స్వాతంత్ర్యానికి ఉదాహరణ. ఈసందర్భంలో నేను రెండు ఉదంతాలను పేర్కొంటాను. వీర సావర్కారుగాని ఆ శ్రేణికి చెందిన ఇతర నాయకులు గాని నాబోటి హిందూ యువకులకు ఈ సంకట స్థితిలో సరియైన మార్గం చూపించలేరనీ, ముస్లింలీగుయొక్కయూ గాంధీజీయొక్కయూ దుష్ట ప్రభావాన్ని అరికట్టడానికి మేము చేసుకున్న పోరాట కార్యక్రమాన్ని ఈ పురాతన నాయకులలో ఎవ్వరు ఆమోదించరనీ, అప్పటికే నాకు తెలిసిపోయినది. 1946 ఆ ప్రాంతాల నౌకాళిలో సుహ్రావర్దీ ప్రభుత్వం అధ్వర్యాన జరిగిన దురంతాలకు నా రక్తం నఖశిఖపర్యంతమూ ఉడికిపోయింది. ఎవరి మూలంగా ఈ దురాగతాలు జరిగినవో ఆ సుహ్రావర్దీనే గాంధీజీ చివరకు వెనక వేసుకొని రావడం మొదలుపెట్టెను. ప్రార్థన సమావేశాలలో కూడా అతనిని షహీద్ సాహెబ్ అని సంబోధించుట మొదలుపెట్టెను.

అంతేగాక ఢిల్లీకి తిరిగివచ్చినప్పటినుండీ గాంధీజీ భంగీకాలనీలో హిందువులు పూజచేసే దేవాలయంలో ప్రతిరోజూ ఖొరాన్ చదువుట ఆరంభించెను. కాని ఒక్కరోజూనైనా ముస్లింల ఎదుట మసీదులో భగవద్గీత చదివే ధైర్యం గాంధీజీకి లేకపోయింది; తాను ఆపని చేస్తే ముస్లింలు హిందువులలాగా ఊరుకోరని గాంధీజీకి తెలుసును. కాని క్షమా సహనశీలురైన హిందువుల ఇష్టానిష్టాలను తృణీకరించడానికిమాత్రం గాంధీజీ ఎన్నడూ సంకోచించలేదు. హిందువులందరూ గాంధీజీ అనుకున్నంతటి దుర్బలులు కారనీ, ఆత్మగౌరవానికి భంగం కలిగినపుడు హిందువులు కూడా ఎదురుతిరిగే వారు కొందరు ఉన్నారనీ, ఆయన గుర్తించవలెనని నేను అనుకున్నాను.

ఈ ఉద్దేశ్యంతో [illegible] గాంధీజీ ప్రార్థన [illegible]

జరిపి, మళ్లీ ఆయన జన్మలో ఖొరాన్ చదవకుండా చేయాలని తీర్మానించుకున్నాము. ఈ నిర్ణయాన్ని అనుసరించి, ఒకరోజున ఆప్టే, కొంతమంది కాండిడేటులను వెంటబెట్టుకొని గాంధీజీ ప్రార్థన చేస్తున్న స్థలంలోకి చొరబడ్డాడు. బైటనుంచి జనసమూహం రావడం కనిపెట్టి గాంధీజీ మెల్లిగా ఇంట్లోకి జారుకొని తలుపుల వెనక నక్కి కూర్చున్నాడు. మాకు, అప్పుడు గాంధీజీమీద బలప్రయోగం చేయవలెనన్న ఉద్దేశ్యమేలేదు.

పత్రికలలో ఈ కథఅంతా చదివి వీర సావర్కారు నన్ను విడిగా పిలిచి ఇటువంటి ప్రదర్శనలు చేయడం ప్రజాస్వామ్య విరుద్ధమనీ ఇటువంటి అరాచకమైన చర్యలు చేయకూడదనీ నన్ను మందలించెను. మేము జరిపిన ప్రదర్శన శాంతియుతంగానే సమాప్తమైనా వీరసవర్కారు దానిని ఆమోదించలేదు. కావలసివస్తే, మీరు విడిగా సభలు జరుపుకొని గాంధీజీ బోధనలను ఖండించవచ్చును గాని, మీరువెళ్ళి గాంధీజీ సమావేశములను భగ్నపరచకూడదని ఆయన విమర్శించెను. వివిధపక్షాలు తమలోతమకు ఎన్ని విభేదములు ఉన్నా రాజ్యాంగ బద్ధంగా ఆందోళన సాగించవలెనని ఆయన ఉద్దేశ్యం.

దీనితరువాత జరిగిన రెండవ ప్రధాన సంఘటన భారతదేశమును విభజించుటకై జరిగిన నిర్ణయము. ఈ విధముగా, దేశవిభజన జరుపుటకు సమ్మతించి, మిగిలిన భాగమునే భారతదేశము అని వ్యవహరించి పాలించుటకు సిద్ధమయే కాంగ్రెసు ప్రభుత్వం - మిగిలిన భాగంలో కాంగ్రెసు ప్రభుత్వమే ఏర్పడుతుంది కనుక - పట్ల హిందూ మహాసభ వైఖరి ఎట్లా ఉంటుందో తెలియజేయవలసినదని కొందరు హిందూ మహాసభ సభ్యులు తెలుసుకొనగోరిరి. అప్పుడు వీర సవర్కార్ వంటి అగ్రనాయకులు, అటువంటి స్వతంత్రభారత ప్రభుత్వమును వెన్నుకట్టివలె కాంగ్రెసు పార్టీ ప్రభుత్వముగా భావించరాదనీ, పాకిస్థాన్ ఏర్పడినందుకు మనమెంత విచారించినప్పటికీ, నూతనంగా ఉద్భవించిన స్వతంత్ర భారతదేశంపట్ల భక్తి విశ్వాసాలు కలిగిఉండటమే మన ముఖ్యకర్తవ్యము అయి ఉండవలెననీ, స్పష్టముగా వెల్లడించిరి. అప్పుడే మనం కొత్తగావచ్చిన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలమనీ; మనలో మనం పోరాడుకుంటె, ఇండియానంతా పాకిస్థాన్‌గామార్చ ప్రయత్నిస్తున్న ముస్లిముల దురాలోచన ఫలించే అవకాశం ఏర్పడుతుందనీ, వారు హెచ్చరించిరి.

అప్పుడు నేను, నా మిత్రులు కలిసి సవర్కార్ నాయకత్వమునకు స్వస్తి చెప్పవలసిన సమయం వచ్చినదనీ, అతనితో ఇంక ఎంతమాత్రమూ సంప్రదించకుండా మా కార్యక్రమాలను మేమే నిర్ణయించుకోవాలనీ నిశ్చయించితిమి.

### ఆశయ ప్రకటనమే నా ఉద్దేశం

దాదాపు, మూడు నాలుగువందల మంది ముందరే, పట్టపగలే, నేను గాంధీజీ మీద తుపాకి కాల్చితిని కాని పారిపోలేదు. పారిపోవాలనే ఉద్దేశ్యమే లేదు. నన్ను నేను తుపాకితో కాల్చుకొనుటకు కూడా నేను ప్రయత్నించలేదు. బహిరంగ న్యాయస్థానములో నా ఉద్దేశ్యాలనుగురించి వెల్లడిగా చాటటమే నా ఉద్దేశ్యం కనుక నేనెన్నడూ ఆత్మహత్య చేసుకోవాలని ఆలోచించలేదు.

### ఆరోపణలు సరిగాలేవు

మా మీద చేయబడిన ఆరోపణలు న్యాయశాస్త్రరీత్యా సరిగా లేవు. 20వ తేదీ బాంబు కేసునూ, 30వ తేదీ నాటి సంఘటననూ అక్రమంగా కలిపి కేసును బలహీనము చేసిరి.

నేను పైన చెప్పినదానికి భంగంకలుగని పద్ధతిలో నాపై చేయబడిన ఆరోపణలకు సమాధాన మిచ్చుచున్నాను:

ముద్దాయిలు వ్యక్తిగతంగానూ, అందరూ కలిసి, అనేక నేరాలను చేసినట్లు ఆరోపించబడినది. జనవరి 20వ తేదీనాటి సంఘటన, 30 తేదీనాటి సంఘటన ఒకదానితో నొకటి సంబంధించినవని, ప్రాసిక్యూషన్‌వారు అభిప్రాయపడుతున్నారు. ఇవి రెండూ ఒకే కుట్రకు చెందినవనీ, గాంధీజీ హత్యలో పర్యవసానం చెందినవనీ వారు అభిప్రాయపడుతున్నారు. జనవరి 20న నేడిన, అంతకుముందు జరిగిన సంఘటనలకూ, అతను తన 30వ తేదీ నాడు జరిగిన సంఘటనకూ ఎంతమాత్రమూ సంబంధములేదని నేను వాదిస్తున్నాను.

### ఆక్షేపణలు

ముద్దాయిలపై చేయబడిన ఆరోపణలలో మొట్టమొదటిది వారు గాంధీజీని హత్యచేయుటకు కుట్రచేసినారన్నది. దానికి నేను మొదట సమాధానమిచ్చెదను. నేరారోపణ పత్రంలో ఉదహరించబడిన పనులలో దేనిని చేయుటకైననూ ముద్దాయిలు కుట్రచేయలేదని నేను వాదిస్తున్నాను. ఆరోపించబడిన నేరములనుచేయుటకు నేను ఇతరముద్దాయిల నెవ్వరినీ ప్రోత్సహించలేదనికూడా నేను స్పష్టపరుస్తున్నాను.

ఈసందర్భంలో ప్రాసిక్యూషన్ వారిప్పించిన సాక్ష్యం కుట్రజరిగినదని నిర్ధరించదు, ఋజువుచేయదు. కుట్ర జరిగినదని చెప్పిన సాక్షి ఒక్క దిగంబర్ ఆర్. బాడ్గే మాత్రమే. ఇతడు ఎంత మాత్రము నమ్మడానికి వీలుకాని సాక్షి అని నా వకీలుగారు స్పష్టపరచగలరు.

### లైసెన్సు లేకుండా ఆయుధాలను ఉంచుకొనుట

పోతే, లైసెన్సులేకుండా ఆయుధములను, మందుగుండు సామానును సేకరించుట, రవాణా చేయుట, 48 జనవరి 20న అందుకు యితరుల ప్రోత్సహించుట అను ఆరోపణను కూడా నేను ఖండించుచున్నాను. అవిధంగా భారత ఆయుధముల చట్టమును, ప్రేలుడుపదార్థముల చట్టములలోని నిబంధనలకు భిన్నముగ ప్రవర్తించి, శిక్షార్హమైన నేరము చేయలేదని తెలుపుచున్నాను.

ఈ విషయమున కూడా ముఖ్య సాక్షి బాడ్గేయే. అతడు ఎంత మాత్రము నమ్మదగినవాడు కాడని ఇదివరకే చెప్పితిని. ఈ వ్యక్తిని నేను ఎరుగుదును కాని, కొన్ని సంవత్సరములుగ అతడు నా దగ్గరకు వచ్చుచుండుటగాని, నేను అతని యింటికి పోవుచుండుటగాని జరుగుటలేదు. 48 జనవరి 10న తనను ఆప్టే హిందూరాష్ట్ర ఆఫీసుకు తీసికొని వచ్చెనని అతడు చెప్పినది అబద్ధము. అతడు ఆరోజున అక్కడే కాదు, ఇంకెక్కడా కూడ నన్ను కలుసుకోలేదని, అతడు ఆప్టేనా ముందు చేబాంబులను గురించి, గన్‌కాటన్‌స్లాబ్స్‌ను గురించి వాటిని బొంబాయిలో ఇచ్చి వచ్చారన్న విషయం గురించి మాట్లాడుకొనలేదని నేను చెప్పుచున్నాను.

ఆప్టే నన్ను నాగదిలోనుండి బయటికి రమ్మనెనని, చేబాంబులు వగైరా నాకిచ్చుటకు బాడ్గే సిద్ధముగ నుండెనని, ఒక పని పూర్తిఅయినదనెనని బాడ్గేఇచ్చినవాఙ్మూలము పూర్తిగా అబద్ధము. అంతే కాక, ఛార్జిషీటులో చెప్పినట్లు 48 జనవరి 20న ఢిల్లీలో నాకద్దగాని, నేను ప్రేరేపించినవారివద్దగాని ఎట్టి ఆయుధములు, మందుగుండుసామానులేవని నేను చెపుచున్నాను. ఈ సందర్భములోకూడ సాక్షి ఒక బాడ్గే మాత్రమే తనప్రాణం రక్షించుకోవాలనే ఆశతో అతడు అబద్ధపు సాక్ష్యం ఇచ్చాడనీ, అట్లా సాక్ష్యమిస్తానన్నందుకే అతనికి క్షమాపణ ఇవ్వబడెనని చెప్తున్నాను.

48 జనవరి 20న బిర్లాభవనంవద్ద గన్‌కాటన్ స్లాబ్ ప్రేల్చవలెనని మదన్లాల్ కె. పహ్వాను నేను ఒక్కణ్ణేగాని, ఇతరులతో కలిసిగాని ప్రేరేపించానన్న దానిని కూడా నేను ఖండిస్తున్నాను.

ఈ ఆరోపణను ఋజువుచేసే సాక్ష్యం లేదు. ఉండే కొద్ది సాక్ష్యము ఆ ప్రేలుడుతో నాకు సంబంధము పెట్టజాలదు.

"మహాత్మా గాంధిని హత్య చేయు ప్రయత్నములో" ఇతరులను ప్రేరేపించానన్న ఆరోపణను ఖండించుచు, మదన్లాల్ కె. పహ్వాలోగానీ ఇతరు లెవరిలోగాని ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని నాకు సంబంధం లేదని తెలుపుచున్నాను. ఈ ఆరోపణను ఋజువు చేయు సాక్ష్యము కూడా లేదు.

లైసెన్సులేని పిస్తోలుగాని, మందుగుండు సామానుగాని నారాయణ ఆప్టే సాయంతో నేను దిగుమతి చేయలేదు. తీసుకు రాలేదు. ఆ పిస్తోలును దత్తాత్రేయ ఎస్. పరచూరె, నారాయణ డి. ఆప్టే సంపాయించిరన్న దానినీ, సంపాయించుటలో నాకు తోడ్పడిరన్న దానిని కూడ నేను ఖండించుచున్నాను. ఈ సందర్భంలో ప్రాసిక్యూషన్ చెప్పించిన సాక్ష్యం నమ్మదగినదికాదు.

### ఢిల్లీరాకకు కారణం

పిమ్మట గాడ్సే, తాను ఢిల్లీ ఎందుకు వచ్చినది ఇట్లు వివరించెను. గాంధీజీ ఆశయములకు, మార్గములకు భిన్నమైన ఆశయములను నేను బలపరచుచుంటి ననువిషయము దాపరికమెన్నడూ లేదు. గాంధీజీ బోధించిన సంపూర్ణ 'అహింసా' విధానము పుట్టకుదరు హిందూజాతిని నిర్వీర్యమొనర్చుననీ, అవిధముగ జాతికి దురాక్రమణలను ఇతరజాతుల ముఖ్యముగ ముస్లిముల దురాగతములను నిరోధించుటకు తగిన శక్తిలేకుండ చేయునని నేను మొదటనుండి విశ్వసించుచుంటిని. దీనికి ప్రతిగ వ్యవహరించుటకు నేను నిశ్చయించుకుని, ఇదే విధమైన అభిప్రాయములుగల కొందరితో ఒక బృందము ఏర్పరచితిమి. ఆప్టే, నేను ఇందులో ఎక్కువ శ్రద్ధ తీసుకొనుచు ప్రచారసాధనముగ 'అగ్రణి' అనే దైనిక పత్రిక పెట్టితిమి. ఇక్కడ నేనొక్క సంగతి చెప్పవచ్చు. మా బృందము, నేను వ్యతిరేకించినది గాంధిజీ అహింసా బోధనలనేకాదు, హిందూజాతికి, దానియొక్క క్షేమములకు ప్రమాదహేతువు, వినాశకరము అయిన విధముగ ఎప్పుడును ముస్లిము పక్షపాతమును ప్రదర్శించుచున్న గాంధిజీయే. హిందూజాతి అనేక కష్టనష్టాలకు గురి అయిన కాన్పుత గాంధీజీపై ఎట్లున్నదో తభావతులేకుండ నిర్ధరించే అనేక నిదర్శనములను చూపుచు, నా దృక్పథమును వివరించినాను.

పిమ్మట గాడ్సే, జనవరి 30-న జరిగిన సంఘటన కేవలము, పూర్తిగ రాజకీయమైనట్టిదేనని నొక్కి చెప్పుచు, స్వాతంత్ర్యోద్యమం ప్రారంభంనుండి, దేశ విభజనవరకు జరిగిన రాజకీయ పరిణామములను వివరించెను. పాకిస్థాన్ స్థాపన తనకు 'మనశ్శాంతి' లేకుండ చేసినదని చెప్పుచు, పాకిస్థాన్ ఏర్పడిన తర్వాత అయినను, ఈ గాంధేయ ప్రభుత్వము పాకిస్థానులోని హిందువుల సంరక్షణకు ఏమైన చర్యలు తీసికొన్నచో తాను తన మనస్సును సమాధాన పరచుకొనుటకు వీలు చిక్కెడిదని అతడనెను.

గాంధిజీని హత్యచేసిన తాను సంపూర్ణముగ నాశనమవుదుననీ, ప్రజలకు తనపడ ఏహ్యముతప్ప మరొకటి వుండదని తనకు తెలుసుననీ, గాడ్సే ఇట్లు చెప్పెను. "నా ప్రాణముకన్న ఎక్కువైన నా మానము పోవునని నాకు తెలియును. అయితే గాంధిజీ లేనిపక్షమున భారత రాజకీయములు వాస్తవిక పద్ధతిని నడచునని నేను తలచితిని. సాయుధ సైన్యములతో ఎదుర్కొని ప్రతీకారచర్యతీసికొనవచ్చునని విశ్వసించితిని. నాకిక భవిష్యత్తు అన్నది లేదని తెలియును. అయితే పాకిస్తాను దురాగతములనుండి దేశము రక్షింపబడుననుకొంటిని. నాకు ఎవ్విధమైన బుద్ధిలేదని ప్రజలుఅనవచ్చును. వట్టి పిచ్చివాడనని అనవచ్చును. కాని నేను అంతా తీవ్రముగ ఆలోచించి దేశము సహేతుకమైన పద్ధతులమీద అభివృద్ధిచెందవలెనని నవది అపసరమని నిర్ణయించుకున్నాను. దీనినిగురించి ఎవరితోనూ సంప్రతించలేదు. నా ధైర్యాన్ని అంతనూ రెండు చేతులలో కూడగట్టుకొని బిర్లాభవనములో ప్రార్థనాస్థలమున 1948 జనవరి 30న గాంధిజీపై రివాల్వరును కాల్చితిని. గాంధిజీ జాతికొరకు త్యాగములను చేసెననుచు గాడ్సే ఇట్లుచెప్పెను. గాంధిజీభారతీయులకు జ్ఞానోదయమును కలుగచేసెను. స్వార్థముకొరకాయన ఏమీ చేయలేదు. కాని, అహింసా సూత్రము అన్ని రంగములందు భగ్నమైనదను సత్యమును అంగీకరించు నిజాయితీ ఆయనకు లేకపోయినదని చెప్పుటకు నేను బాధపడుచున్నాను. గాంధిజీ కన్న యెక్కువ త్యాగములను చేసిన, ప్రతిభావంతులైన ఇతర భారత దేశభక్తుల జీవిత గాథలను చదివితిని. వారిలో కొంతమందిని స్వయముగా చూచినాను. అదంతా ఎట్లున్నా, గాంధిజీ దేశమునకు చేసిన సేవను భక్తితో తలవంచి నమస్కరించెదను. గాంధిజీపై రివాల్వరును కాల్చుటకు ముందు తలయొగ్గి ఆయనకు ప్రణామము చేసితిని." "ఏమైనప్పటికీ, ఆయన ఆరాధన దేవత అయిన దేశమును విచ్ఛేదించుటకు గాంధిజీకి హక్కులేదు. ఆయన ఆ పనిని చేసెను. ఆయనంటే వ్యక్తిగతంగా శతృభావంలేదు. పాకిస్తాను నిర్మాణమునకు గాంధిజీ సదుద్దేశముతో ఆమోదించెనని అనే వారికి, నే తీసుకొనిన యీ తీవ్ర చర్యకు జాతి శ్రేయస్సు తప్ప అన్య భావము లేదని చెప్పదలచితిని. పాకిస్తాను నిర్మాణముతో పూర్తి అయిన దుస్సంఘటనలను గాంధిజీ అందరికన్న బాధ్యుడని నావిశ్వాసము. పాకిస్తాన్ నిర్మాణమునకు అంగీకరించక పోయిన దేశమునకు స్వాతంత్ర్యము వచ్చియుండెడిదికాదని కొందరి అభిప్రాయము. కాని ఇది సహేతుకమైనదికాదు. నాయకులు తీసికొనిన నిర్ణయమును సమర్థించుటకు ఈకారణమును తెలుపుచున్నారు. తమ బలముచే స్వరాజ్యమును సాధించితిమని గాంధిజీ అనుచరులైన నాయకులు అనేక పర్యాయములు తెలిపిరి. అలా అదయిన బ్రిటిషువారు పాకిస్తాను ఆమోదిమునా ఒక షరతుగా ఎట్లు పెట్టగలరు? మొదట కావని తర్వాత ముస్లిము లొంగిపోవుట ఈనాయకులకు అలవాటు." గాంధిజీ, కడపటి ఉపవాసము చేసిన పరిస్థితులను గురించి చెపుతూ అప్పుడు గాంధిజీ చేసిన ప్రతి షరతూ ముస్లిములకు అనుకూలముగ నున్నదనీ గాడ్సే యిట్లనెను. ఢిల్లీలోని కొందరిశరణార్థులు ఆక్రమించుకొన్న మసీదులను తిరిగి ముస్లిములకు ఇవ్వవలెనని గాంధిజీ పెట్టిన షరతులలో ఒకటి. కేవలము బలవంతముమీదనే ప్రభుత్వముచే ఈ షరతును ఆమోదింపచేసెను. నేనపుడు ఢిల్లీలో ఉన్నందువల్ల, ఈ షరతును పాలించుటలో జరిగిన సంఘటనలను కళ్లార చూచాను. అపుడు ఢిల్లీలో అమిత చలిగాయున్నది. గాంధిజీ ఉపవాస విరమణ రోజున వాన కురియుచున్నది. ఆశ్రయంకోసం ఢిల్లీ వచ్చిన కుటుంబములు ఒకరితరువాత ఒకరిని ఈ మసీదులనుండి వెళ్లగొట్టిరి. ఒకరిద్దరు తమపిల్లలను, ఉన్న కొద్ది సామానులను తీసికొని తమకు ఆశ్రయము చూపవలసినదని గాంధిజీని అడుగుటకు బిర్లాభవనమునకు వచ్చిరి. కాని వారికి ఆయన దర్శనమబ్బుట సాధ్యమా. ఎంత కఠిన హృదయుమైనను కరగజేసెడి ఆదృశ్యములను నేను చూచితిని, మశీదులనుండి వారిని వెడలిపొమ్మనిరిగాని వారికి వేరె ఆశ్రయమివ్వలేదు." రజాకర్ల కృత్యముల ప్రసక్తిచేయుచూ గాడ్సే ఇట్లు తెలిపెను.

"రజాకర్లు హిందువులపైనచేసిన అత్యాచారము గాంధీజీ మనస్సుకు తట్టలేదు. రాజ్యత్యాగము చేయవలసినదని ఆయన నైజామును ఎప్పుడూ అడుగలేదు. గాంధీజీ నాయకత్వము క్రింద భారతరాజకీయములు సాగిన. విభాజ్యమైన భారతదేశంలో లభించిన పరిమిత స్వాతంత్ర్యంకూడా ఉండదని నాకు తోచినది. ఈ భావము పదే పదే నా హృదయంలో త్రోసికొని వచ్చినది; పైన చెప్పిన సంఘటనలు జరుగుచుండగా, హిందూ ముస్లిము సఖ్యతకు గాంధిజీ ఉపవాసము ప్రారంభించెనని జనవరి 13న వెల్లడి అయినది. అంతటితో నామీద నా కున్న పట్టు తప్పి పోయినది."

గాంధిజీ అహింసా సిద్ధాంతము పరస్పర విరుద్ధమైనదని గాడ్సే ఇట్లు చెప్పెను: "పాకిస్తాను కాశ్మీరుపైన దండయాత్ర ఆరంభించినది. కాశ్మీర్ మహారాజా సహాయముడుగగా, షేక్ అబ్దుల్లా ప్రధాని అయిన సహాయము చేసెదమని నెహ్రూ ప్రభుత్వము తెలిపినది. కాశ్మీరుకు సహాయమంపుట పరోక్షముగా పాకిస్తానుతో యుద్ధమని వారికి తెలియును. గాంధిజీ యుద్ధమునకు విముఖుడు. అయినప్పటికీ కాశ్మీరుకుసహాయము అంగీకరించెను. సత్యాగ్రహ సిద్ధాంతమును బట్టి కొంతమంది సత్యాగ్రహులను పంపియుండవలసినది.

"గాంధిజీమీద నేను రివాల్వరును కాల్చుటతో, నా స్థానమునకు ఆయన జీవితముతో పాటు నా జీవితము కూడ అంతమైనది. ఆరోజునుండి నేను ధ్యానములో రోజులను గడుపుచున్నాను. ఇప్పటివరకు జరిగినదంతా నాకు సంపూర్ణముగా తృప్తికరముగానేయున్నది. ఇంతవరకు అనవసరముగా వాయిదావేయబడిన హైదరాబాద్ సమస్య గాంధిజీ మరణానంతరమే సైనికచర్యద్వారా తృప్తికరముగా పరిష్కరింపబడినది. ప్రస్తుత భారతప్రభుత్వము వాస్తవిక పద్ధతులను అవలంబించుచున్నది. దేశము ఆధునిక ఆయుధములను కలిగియుండవలెనని దేశ అంతరంగిక వ్యవహారమంత్రి చెప్పినట్లు తెలియుచున్నది. ఈ అభిప్రాయము గాంధిజీ ఆశయములకు విరుద్ధము కాదని ఆయన తెలిపెను. ఆత్మ సంతృప్తికి ఆయన అవిధముగ చెప్పవచ్చు" కోర్టు జడ్జికి గాడ్సే ఈవిధముగ తెలిపెను. నా భావో ద్రేకమును గురించి దానికి లోనై నేచేసిన చర్యను గురించి కోర్టువారు ఏ విధముగ నైన అభిప్రాయ పడవచ్చును. తమకు తోచిన ఏ శిక్షనైన వేయవచ్చును. ఆ విషయమై నేను ఏమి చెప్పదలంచలేదు. నాపైన కరుణ చూపవలెనని అడుగదలచలేదు. నా పక్షమున మరొకరు అడుగనూ అక్కరలేదు. అనేకమంది నా తోపాటు ఈ సందర్భములో నేరస్థులుగా చూపబడిరి. నా కెవరూ సహాయులు లేరని, నేను చేసిన చర్యకు నేనే బాధ్యుడనని ఇదివరకే చెప్పితిని. వారిని నేరస్థులుగా చేయక పోయిన నేను డిఫెన్సు వాదమును పెట్టకపోవుదును కాను. నా పక్షమున సాక్షుల నెవరినీ క్రాసు పరీక్ష చేయవద్దని నేను వకీలుకు చెప్పుటే దానికి నిదర్శనము. ప్రచారము నిమిత్తము జనవరి 20న కూడ శాంతియుతమైన ప్రదర్శనములు చేయుటకు నేనంగీకరింపలేదు. అయినప్పటికీ ఎంతో అయిష్టముతో గాంధిజీ ప్రార్థనాసభ సమయమున చేయదలచిన శాంతి ప్రదర్శనయందు పాల్గొన ఒప్పుకొంటిని. అదికూడా సాధ్యపడనందుకు చాలా ఆశాభంగము చెందితిని. తెగించుటకు నిశ్చయించితిని. నేను చెప్పిన సంగతులన్ని సత్యములు, నాచర్యను ప్రజలు బాగడవలెనను ఉద్దేశముతో నేనింత దీర్ఘమైన ప్రకటనను చేయలేదు. నా విషయమై ఎట్టి దురభిప్రాయము సందేహము లేకుండుటే నా ఉద్దేశము. గాడ్సే తన స్టేటుమెంటును ఇచ్చి కూర్చొనుటకు ముందు ఈ విధముగ తెలిపెను. "కాంగ్రెసుతో నాకు ఎట్టి శతృత్వము లేదు. ఆ సంస్థ దేశ రాజకీయ అభివృద్ధికి చేసిన సేవను నా కెప్పుడు గౌరవమే. వారి నాయకులతో నాకు అభిప్రాయ భేదము లున్నవి. ఈ విషయమును నేను సవార్కారుకు ఫిబ్రవరి 28న వ్రాసిన లేఖనుబట్టి తెలియగలదు. నేను చెప్పినదంతయు ఓర్పుతో వినినందుకు, కృతజ్ఞుడను. ఈకేసుకు సంబంధించిన పోలీసు అధికారులపైన కూడ నాకు ఎట్టి ద్వేషము లేదు. వారు నా యెడ చూపిన దయకు వందనములు. కారాగృహములో నాకు చూపిన గౌరవమునకు జైలు అధికారులకు వందనములర్పించుచున్నాను.

## ఈజిప్ట్ - బ్రిటన్ సంబంధాలు

### ప్రతిష్టంభనా పరిష్కారానికి తిరిగి సంప్రదింపులు

మాజీప్రధాని సిద్దికిపాషా సూచన

కైరో, నవంబరు 6: "సుడాను, పాలెస్తీనా సమస్యలు, ఈజిప్టుకు అవినాభావ సంబంధముగలది. బ్రిటనుతో కనుక మాకు ఒప్పందము కుదిరిన తక్షణము, అన్ని సమస్యలు వాటంతట అవి పరిష్కారము కాగలవు." అని ఈజిప్టు పూర్వ ప్రధాని ఇస్మాయిల్ సిద్దికీ పాషా నేడు చెప్పెను.

"పాలెస్తీనా సమస్యను పరిష్కరింప సామర్థ్యము మాకున్నది." అని అక్బర్ ఈల్ యోమ్ అను పత్రికకు ఇచ్చిన ప్రకటనలో ఆయన తెలియచెప్పెను. 1946 సం॥ లో ఏర్పడిన ప్రతిష్టంభనను తొలగించుటకు బ్రిటను, ఈజిప్టు తిరిగి సంప్రతింపులు ప్రారంభించవలెనని ఆయన సూచించెను. "సంప్రతింపులవల్ల ఫలితములుండునని తోచిన అందుకు మనమే (ఈజిప్టు) ముందు ప్రయత్నించవలెను." అయితే ఆదేపత్రికలో "బ్రిటనుతో రాయబారములు ప్రారంభించుట కన్న మంత్రి పదవికి రాజీనామా ఇవ్వటం నాఅభిమతం" అని ప్రస్తుత ప్రధాని చెప్పినట్లు ప్రకటింపబడెను. "మనము అడిగిన వాటి కన్నిటికీ బ్రిటను అంగీకరించక పోవచ్చును. రాయబారములు ఇచ్చి పుచ్చుకొను భావములో జరుపవలెను. ప్రస్తుత సమయము రాయబారములకు అనుకూలమున్నది. ఉభయ దేశములకు నడుమనున్న విభేదములు చాలవరకు తగ్గినవని" అని సిద్దీకి పాషా తెలిపెను. రెండేండ్లక్రితం 1936 స॥ ఒడంబడికను మార్చుటకు ఈయన బ్రిటనుతో రాయబారములు జరిపెను. బ్రిటనుతో కుదిరిన ముసాయిదా ఒప్పందమునకు ఈజిప్టులో ప్రాతికూల్యము వచ్చుటచేత 1946 డిశంబరు 8 తేదీన ప్రధాని పదవికి రాజీనామా నిచ్చెను.

## ఇండొనీషియా సమస్య

### సత్వరమే పరిష్కరించమని భద్రతామండలికి విజ్ఞప్తి

బటేవియా, నవంబర్ 7: ఇండొనీషియా సమస్యను పరిష్కరించుటకు సత్వర చర్యలు తీసుకొనక పోతే పరిస్థితి చేయిదాటి పోగలదని జోగ్జకర్తా రేడియో ద్వారా నేడు భద్రతామండలికి రిపబ్లికనులు ఒక అభ్యర్థనను అందజేసిరి.

కారు నల్లని యుద్ధ మేఘాలావరిస్తున్నట్లూ, డచ్చివారు తిరిగి సాయుధ చర్యలు ఉపక్రమింప నున్నట్లు కూడ రిపబ్లికన్ రేడియో అన్నది. ఇండొనీషియన్ సహకారం లేనిదే యూరప్‌ను ఆర్థికంగా పునర్నిర్మించుట కవసరమైన ఇండొనీషియన్ ముడిపదార్థములు లభ్యం కావని కూడ ఆ రేడియో హెచ్చరించినది.

నేడు జోగ్జకర్తాకు వెళ్ళి రిపబ్లికన్ ప్రధానితో ఆఖరి చర్చలు జరుపవలసిన డచ్చి విదేశాంగ మంత్రి డా॥ డి. యు. స్టిక్కర్ తన ప్రయాణమును దాదాపు బుధవారంవరకూ వాయిదా వేసెను. రిపబ్లికనులు తెలవని తలంపుగా ఒక లేఖను పంపినందున, ఆ లేఖాంశములను హేగ్‌కు తెలియజేసి గాని తిరిగి యీ "ఆఖరి చర్చలు" ప్రారంభింప వీలులేదని కొందరు అభిజ్ఞులు చెప్పుచున్నారు.

## వైమానికుల ఆటల పోటీలు

### ఉపప్రధాని ప్రారంభోపన్యాసం

న్యూఢిల్లీ, నవంబరు 7: భారతీయ వైమానిక దళములోని వివిధశాఖలకు చెందిక్కడ ఆటలపోటీలు ప్రారంభమైనవి; ఈ సందర్భంలో భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేలు ప్రారంభోపన్యాసం చేస్తూ ఇలా అన్నాడు:- "సైనికశిక్షణ దృష్ట్యా వ్యాయామక్రీడలకు కూడా చాలా ప్రాధాన్యం ఉన్నది. ప్రాణంమీద తీపిని మూలకొని అనుక్షణమూ ప్రమాద భరితమైన జీవితం గడపడానికి మీరు అలవాటుపడి ఉన్నారు. అందుచేత మీరు వినోదమూ ఆరామమూ చాలా అవసరం. వ్యాయామ క్రీడలు మీకు ఈ రెంటినీ ఇనుమిక్కిలిగా కలుగజేసి, శరీరస్వాస్థ్యాన్ని పెంపొందించగలవు." ఉపన్యాసం చేయడానికి పూర్వం, ఉపప్రధాని గౌరవార్థం పోటీదారులు స్వాగత విన్యాసమును జరిపిరి.

## ఓటర్ల లెక్కింపు

### నిన్నటిరోజు 3625 మంది రిజిస్టరు చేసుకొన్నారు

చెన్నపట్నం, నవంబరు 8: వయోజన ఓటర్లను రిజిస్టరుచేయుటకై నిన్న కార్పొరేషన్‌వారు అన్ని డివిజనులలో వసతులు కలుగజేసిరి. ఓటర్లుగా రిజిస్టరగుటకు ఆఖరురోజైన నిన్నటి రోజున 3625 మంది యీ అవకాశము గైకొని ఓటర్లుగా నమోదు అయినారు.

ఓటరుల జాబితాలు తయారు చేయు కార్యమునందు, 7వ తేది సరికి రాష్ట్రమంతట పెలకారదాదివక్షరాస్తు [illegible] చేసినవని, ప్రావిన్షియలు కమీషనరు తెలిపిరి. డిశంబరు మొదట్లో వారంలో జాబితాలు క్రోడీకరించబడును. 10 తేదీనుండి పేర్లు సరి చూడబడును.

## నూలు సప్లయి

మదరాసు, నవంబరు 8: చెన్నరాష్ట్రమునందు విక్రయించుటకై బొంబాయి కమిషనరు అక్టోబరు వరకు, 57,890 బేళ్ల నూలు ఒసంగెను. అందు 43,221 బేళ్ళు మిల్లులు విడచినవి. అందులో 35,219 బేళ్లు చెన్నరాష్ట్ర చేనేత సహకార సంఘముల వివిధ శాఖలకు చేరెను. బేళ్లు కదలివచ్చుటకు ప్రారంభంలో కొంచెంఆలశ్యమగుచున్నది. త్వరలో వచ్చే ఏర్పాటులు జరుగుచున్నవి. కనుక యికముందు నేతవారికి యిబ్బందులు కలుగవని రాష్ట్రీయ కమీషనరు ప్రకటించుచున్నారు.

## మచిలీపట్నంలో ధారాపాత వర్షం

మచిలీపట్నం, నవంబరు 8: నేడు తెల్లవారికట్ల 3గంటలప్పటినుంచి ఇప్పటవర్షం ధారాపాతముగ కురియుచున్నది. ఉదయం సుమారు 10 గంటల వేళ వరకు దాదాపు 12 దుమ్ముల వర్షం పడింది. ప్రధాన రస్తాలన్ని మోకాలిలోతు నీళ్ళలో మునిగిపోయినవి. పల్లపు ప్రాంతములు సరస్సులవలె నున్నవి. ఆకాశం మేఘావృతమయే వున్నది. (స్వ. వి.)

### తెనాలితాలూకాలో అధిక వర్షాలు

తెనాలి, నవంబరు 8: యీ ప్రాంతంలో వారంరోజుల నుండి అధిక వర్షాలు కురియుచున్నవి. ఈనిన వరిపైరు నన్నకారాముణి, సెంజరు మొదలగు వరిపంటలు చాలా దెబ్బతిన్నవని రైతులు గగ్గోలు పెట్టుచున్నారు. వర్షమునకు కంకిపైనున్న సంకుబాలి పోయినది. చాలా భాగము గాలికి వరిపైరు పడిపోయినది. (స్వ. వి.)

### కాకినాడ

నవంబరు 8: అమావాశ్య తర్వాత నాలుగురోజులు తుపానుగాలి, వర్షము జోరుగానుండి, రెండురోజులు మాత్రము ఎండ కాచినది. తిరిగి యీ రోజున ఉదయంనుంచి వర్షము కురియుచున్నది. వరిచేలకు దెబ్బ తగులుచున్న దనుచున్నారు.

## బ్రిటిషు హోండ్యూరాస్‌పై వివాద

లండన్, అక్టోబరు 6: బ్రిటిష్ హోండ్యూరాస్‌పై అధికారం ఎవరిది? అన్న విషయమై బ్రిటన్‌కూ గ్వాటెమెలా ప్రభుత్వమునకు కొంతకాలంగా వివాద జరుగుచున్నది. ఈ వివాదలో తనతో రాజీకి దిగకుండా బ్రిటన్ చాలా పెడసరపు వైఖరి అవలంబించుచున్నదని, నెపం ఎన్నుతూ, గ్వాటెమలాప్రభుత్వం పంపిన ఒక అధిక్షేపణపత్రాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం నేడు త్రోసిపుచ్చినది. ఈ విషయంలో అంతర్జాతీయ కోర్టు తీర్పుకు కట్టుబడి వుంటామని బ్రిటన్ తన ప్రత్యుత్తరంలో పునరుద్ఘాటించింది.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 8:

వేరుసెనగ: (582 సా 1-8 ఎక్స్‌కోస్టాగిడ్డంగులు) మెషీన్(సేల్సుటాక్సుతో సహా) బజారు(పాతది) రు. 148-0 0 149

ఆఫీసుగ్ద రు.

వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (టాల్‌కోల్)

(సేల్సుటాక్సుతో సహా) రు. 306-8-0 307-8-0

(గ్యారంటీ)

ఆముదం మూరుజెనీవరీ ఎక్సుపెల్లర్ వల్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గల రు. 332-0 0

కొబ్బరినూనె (39 పౌనులు గల డబ్బా) రు. 31 8-9

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-4 ఎక్స్‌ప్రెస్ బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 76.6 0 పెట్లా బంగారు తులం 113 12-0 మూసబంగారు 112-0-0. అపరంజి తులం 100 క (రెడి) 177-0-0 వెండి తులం 1-13-0.

### ప్రకటన

హిందూ 5-11-1948 తేదీ పత్రికలో, సిలోను, బర్మా, అనుమతింపబడిన ఇతర దూరప్రాచ్య దేశములకు ఉల్లిగడ్డలు, మిరపకాయలు, మిర్చి ఎగుమతులకు గాను 28-10-1948 తేదీగల న్యూఢిల్లీ, ఇండియా గవర్నమెంటు, ఆహార మంత్రివర్గమువారి ప్రకటన యొకటి చేయబడినది. అందు "ట్రేడర్లు" అను తరగతుల క్రింద చేరు దరఖాస్తుదారులందరు సదరు ప్రకటనలోని 3-వ పేరాను గమనింపవలసినదిగా కోరబడుచున్నారు. అవసరమైన డాక్యుమెంట్లతో సహా దరఖాస్తులు మద్రాసు చేపాక్ లోని సివిల్ సప్లయిస్ కమీషనరు గారికి 25-11-48 లోగా చేరునట్లు పంపవలసినదిగా వారికి తెలియపరచడమైనది.

ఎస్. ఎస్. మణి,

సివిల్ సప్లయిస్ కమీషనరు సెక్రటరి,

చేపాక్, మద్రాసు.

### టెండరు నోటీసు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

కందిపప్పు, మినపప్పు సప్లయి చేయుటకు టెండర్లు

ఎం. & ఎస్. ఎం. రైల్వే గ్రెయిన్ షాపులకు కందిపప్పు, మినపప్పు, సప్లయి చేయుటకు దిగువ విధముగా సూపర్ స్క్రైబ్ చేసిన, సీల్డు కవర్లలో విడివిడిగా టెండర్లు కోరబడుచున్నవి. అవి 18-11-48 తేది సాయంత్రము 3 గంటలవరకు డిప్యూటీ జనరల్ మేనేజరు (జి. ఎస్.) గారిచే తీసుకొనబడును.

సరుకు. టెండరుమీద సూపర్ స్క్రైబ్ చేయవలసినది.

కందిపప్పు - "GS/OR/TD/MAS/VII Tender for Toor Dhall.

మినపప్పు - "GS/OR/101/VII Tender for Black gram Dhall.

టెండర్లు నిర్ణీత ఫారములలో ఒక్కొక్క సరుకుకు విడివిడిగా పంపవలెను. టెండరు ఫారము ఖరీదు రు 1/- మద్రాసు, పార్కుటవునులోని ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే, హెడ్ మాస్టరు అందు క్యాషియరు వారికి మనీయార్డరు ద్వారా గాని పోస్టల్ ఆర్డరు ద్వారా గాని చెల్లించవలెను. ఈ సొమ్ము వాపసు చేయబడదు.

టెండరు ఫారము క్రింద చెల్లించిన ఖరీదు హెడ్ మాస్టరు అందు క్యాషియర్ కు చేరిన తరువాత సప్లయికి సంబంధించిన షరతులు నిబంధనలతో సహా టెండరు ఫారములు పంపబడును.

**Dy. General Manager, (G. S.)**
4-11-48. Madras.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras.

## మైకేలు స్కాటుకు ప్రయాణానుమతి నిరాకరణ

జోహాన్సుబర్గు, నవంబరు 6: నైరృతి ఆఫ్రికా ప్రాంతము యుద్ధానికి పూర్వము జర్మనీయొక్క ఏలుబడిలోనుండిన ప్రాంతము. కాని యుద్ధానంతరము అది బ్రిటిషు వారికి ఒప్పజెప్పబడెను. దానిని బ్రిటిషు దక్షిణాఫ్రికా ప్రభుత్వముయొక్క ఏలుబడిక్రింద నేకంచి బ్రిటిషు దక్షిణాఫ్రికాలోనే బ్రిటిషువారు చేర్చిరి. కాని, అచటి ఆఫ్రికను బానిసలవారు యీ నైరృతి ఆఫ్రికా ప్రాంతమును ఐక్యరాజ్య సమితి యొక్క ధర్మకర్తృత్వాధికార మండలి అజమాయిషీలో ఉంచవలెనని అచట ఆఫ్రికను తెగల నాయకులు 50 మంది గత సంవత్సరము ఐక్యరాజ్యసమితికి మహజరు పంపుకొనిరి. ఆ మహజరునే యీ సంవత్సరము కూడా తిరిగి పంపుకొనిరి. ఈ ఆఫ్రికను తెగలవారి తరఫున ఐక్యరాజ్యసమితి వద్దకుపోవుటకై గౌరవనీయుడు మైకేలు స్కాటుగారు ఆఫ్రికానుండి లండనుకు వెళ్ళి అచటినుండి ప్యారిసులో సమావేశమైయున్న ఐక్యరాజ్యసమితికి పోదలంచిరి. వీరు విమానముమీద పోవుటకు విమానాశ్రయమునొద్దకు వెళ్ళిరి. అచటి సుంకముల ఆఫీసరువద్ద వీరికి వ్యవహార లాంఛనముగా జరుగవలసిన లెక్క నమోదు లన్నీ చేయబడెను.

ఆయనకు విమాన ప్రయాణానికి అనుమతి పత్రముకూడా యివ్వబడెను. కాని యింతలో ఇమిగ్రేషను ఆఫీసరువచ్చి ఆయన అనుమతి పత్రమును వాపసుచేయవలసినదిగా అడిగెను. దక్షిణాఫ్రికా స్వదేశమంత్రి కార్యాలయమునుండి టెలిఫోను ద్వారా ఉత్తరువు వచ్చినదనియు అనుమతిపత్రమును వాపసు తీసికొనవలసినదని ఉత్తరువు చేయబడెననియు ఇమిగ్రేషను ఆఫీసరు చెప్పెను. అట్టి ఉత్తరువు లిఖితపూర్వకముగా తనకు చూపకపోవుటవల్ల తన అనుమతిపత్రమును వాపసు చేయుటకు మైకేలు స్కాటు నిరాకరించెను. ఈ విషయమై తాను దేశీయ వ్యవహారశాఖామంత్రి డా|| డోంగిస్ కు విజ్ఞాపన చేయుచున్నానని మైకేలు స్కాటుగారు చెప్పిరి. వీరికి ప్రయాణానికి కావలసిన ఇతర పత్రములు ఋజువుపడనందున తమ ప్రయాణమును ప్రస్తుతం విరమించితిమని చెప్పిరి. దక్షిణాఫ్రికా స్వదేశాంగమంత్రి వీరి అనుమతి పత్రమును నేడు రద్దుచేసెను.

నైరృతి ఆఫ్రికాలోని వేర్వేరు తెగలవారి ప్రాంతములను తిరిగి ఒక్కటిగా ఏకీకరణము చేయవలెనని కోరుచు ఆ తెగలవారి నాయకుడను ఫ్రెడరిక్కు మహరేరూగారు ఇటీవల బ్రిటిషు గవర్నమెంటుకు మహజరును పంపుకొనిరి.

## దక్షిణాఫ్రికా ప్రభుత్వ దౌష్ట్యం

జోహాన్సుబర్గ్, నవంబరు 6: నైరుతి ఆఫ్రికాలోని హిరిరో మొదలైన జాతుల నాయకులు 50 మంది గత సంవత్సరము తమ ప్రాంతమును ఐక్యరాజ్య ధర్మకర్తృత్వము క్రిందికి తీసికోవలసినదిగా కోరియుండిరి. తిరిగి ఈ యేడుకూడా అట్లే కోరిరి. ఇక్కడి జాతులన్నిటినీ తిరిగి ఏకము చేయవలసినదని బ్రిటిషు ప్రభుత్వమునుకూడా ఇటీవల కోరియుండిరి. వీరి విషయమై ఐక్యరాజ్యసమితికి విన్నపము చేయుటకుగాను రెవరెండ్ మైకేల్ స్కాట్ లండనుమీదుగా పారిస్ బయలుదేరుచుండగా నేడు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు ఆయన పాస్ పోర్టును రద్దుచేసినట్లు పలువ అధికారులు నోటిమాటగా తెలిపి పాస్ పోర్టును ఇచ్చివేయుమని అడిగిరి. స్కాట్ అట్లుచేయక ప్రభుత్వమునకు ఫిర్యాదు చేసెను. ఆయన ప్రయాణము ఆగిపోయినది.

## పండిత నెహ్రూకు డా|| దాదూ విజ్ఞప్తి

లండన్, నవంబరు 6: స్వయంగా జోక్యము కలిగించుకొని ప్యారిస్ వెళ్ళుటకు తనకు అనుమతిపత్రము నిప్పించవలసినదిగా ద. ఆఫ్రికా కాంగ్రెస్ నాయకుడగు డా|| దాదూగారు భారత ప్రధాని పండిత నెహ్రూగారికి విజ్ఞప్తి గావించియున్నారు.

### విశాఖజిల్లా కిసాన్ కాంగ్రెసు కార్యకర్తల సమావేశము

అనకాపల్లి, నవంబరు 3: విశాఖజిల్లా కిసాన్ కాంగ్రెసు కార్యకర్తలు నేడు వి. వి. రమణగారి అధ్యక్షతను సమావేశమై రంగాగారి జన్మదినోత్సవము జరిపించుటకు ఆంధ్రరాష్ట్ర చెరుకు ఉత్పత్తిదార్ల మహాసభను, ఉప్పలకోటలో జరిగిన జిల్లా ఈనాం రైతు మహాసభకు సహకార మివ్వవలసినదిగా జిల్లా ప్రజలను కోరుచును చెరకుపండించే రైతులకు వ్యవసాయ పనిముట్లు సరఫరాచేయుటలో శ్రద్ధవహించవలెనని ప్రభుత్వమును కోరుచును తీర్మానములు చేసిరి.

## భారత ప్రభుత్వ విధానాలపై సోషలిస్టు ప్రముఖుల విమర్శ

న్యూఢిల్లీ, నవంబరు 6: నేడు ఇచ్చట జరిగిన ఢిల్లీరాష్ట్ర సోషలిస్టు సమావేశంలో సోషలిస్టునాయకులు డా|| రాం మనోహర్ లోహియా, అరుణా ఆసఫాలీగార్లు మాట్లాడుచూ, భారతప్రభుత్వ సంస్థానరాజావారి సంస్థానాధీశులపట్ల చూపుతున్న వైఖరి, కార్మికులపట్ల ప్రభుత్వం చూపుతున్న వైఖరిని, ప్రవాసి భారతీయులపట్ల ప్రభుత్వవిధానాన్ని, స్టెర్లింగు బాకీల పరిష్కారాన్ని విమర్శించిరి.

సమావేశానికి అధ్యక్షతవహిస్తూ డా|| లోహియా ఈ క్రిందివిధముగా ప్రసంగించెను.

"భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనా చిహ్నములయిన సంస్థానాధీశులపట్ల భారతప్రభుత్వ సంస్థానశాఖవారు చాలా ఉదారంగా ప్రవర్తించటం ఉచితంగా లేదు. రాజప్రముఖ్ పదవులన్నిటినీ రద్దుచేసి సంస్థానాలను, సమీపములను పక్కనఉన్న రాష్ట్రాలలో కలిపివేయవలెను. మనదేశంలో గల బ్రిటిష్ సంస్థలన్నిటినీ జాతీయంచేసి, వాటి విలువలను బ్రిటన్ ఇవ్వవలసివున్న స్టెర్లింగ్ బాకీలలో చెల్లువేయవలెను.

కాశ్మీర్ ను విభజించవలెనని మనదేశంలో ఎవరైనా వాదిస్తే వారిని దేశద్రోహులుగా పరిగణించవలెను. కాశ్మీర్ సమస్య సక్రమంగా పరిష్కారం కావలెనంటే, షేక్ అబ్దుల్లానూ, కాశ్మీర్ యోధులనూ సమర్థించటమన్నది ఒక్కటే సవ్యమైనమార్గం."

అనంతరం ఢిల్లీ రాష్ట్ర సోషలిస్టు సంఘ అధ్యక్షురాలు అరుణా అసఫాలీ ఈ విధముగా ప్రసంగించెను:

"భారతదేశ నూతన పరిపాలకులు బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన పరిపాలనా వ్యవస్థను కొంచమైనా మార్చకుండా ఉంచిరి. పదవుల్లో ఉన్నవారికి అధిక సౌకర్యాలు, పరిపాలక - పాలితులపట్ల గల సంబంధాలు - ఇంకా వెనుకటివలె ఉన్నవి. బ్రిటిష్ ప్రభుత్వపు అసమర్థత, అవినీతి సహించరానివయితే, భారతీయ నిరంకుశాధికారులు ఆ మాత్రమైనా శోధించకుండా చేసేపనులు ఘోర అపరాధాలే అవుతవి. అందువలన సామాన్య భారతీయులు ఢిల్లీలో జాతీయ జనకుని చిహ్నలను ఊహించలేకుండా ఉన్నారు. ధరలు నానాటికీ పెరిగిపోయి కష్టపడి జీతాలమీద బ్రతికేవారి బ్రతుకులను దుర్భరం చేస్తున్నవి. స్వల్పోత్పత్తి, అక్రమ పంపిణీలను నివారించవలెనంటే కార్మికులనొక్కరినే నిందిస్తే ప్రయోజనంలేదు. తమకు అన్యాయం జరుగదని కార్మికులకు హామీ ఇస్తే వారు ప్రభుత్వంతో పూర్తిగా సహకరించగలరు."

## భారత వైమానికశాఖకు జెట్ విమానాలు

న్యూఢిల్లీ, నవంబరు 6: ఇంగ్లండునుండి మూడు డిహావిలాండ్ వాంపైర్ జెట్ విమానాలువచ్చి నిన్న పాలమ్ విమానాశ్రయములో దిగినవి. కాలక్రమమున అధునిక విమానము లింకను రానున్నవి. ఈ జెట్ విమానములు ఒంటి ఇంజను కలిగి గంటకు 500 మైళ్లనుమించిన వేగముతో పోగలవు. మధ్యదారిలో తొమ్మిదిచోట్ల ఆగి ఈ విమానములు ఇంగ్లండునుండి 20 గంటలలోపు కాలములో వచ్చినవి. ఇవి 59,491 అడుగుల ఎత్తున ఆకాశములో ఎగురగలవు. (ఇంతకుమించి ఎత్తు వెళ్లగల విమానములు లేవు.) రెక్కలలో నూనె టాంకులు అమర్చినచో ఈ విమానములు అగకుండ 1400 మైళ్లు వెళ్లగలవు. బ్రిటిషు వైమానికశాఖలోనున్న జెట్ విమానములు ఇటువంటివే. వీనిని నడుపుటయందు భారత వైమానికులు శిక్షణ పొందుచున్నారు.

## భారత నౌకాదళమునకు యింకా 3 యుద్ధనావలు

బొంబాయి, నవంబరు 6: రాయల్ నౌకాదళమువారు రాయల్ భారత నౌకాదళమునకు మూడు ఆర్-తరగతి డిస్ట్రాయర్లను (ఒక రకమైన యుద్ధనావ) వప్పజెప్పెదరు. వానిని వప్పజెప్ప ఉత్సవము 1949 సం||ము మధ్యభాగమున జరుగును. ఈ నావలను వప్పగింత పెట్టుకొనుటకును, వానిని భారతదేశమునకు తీసికొని వచ్చుటకును 81 మంది నావికులు, లెఫ్టినెంటు కమాండర్ లాల్ కాకా, లెఫ్టినెంట్ రో గారల అధిపత్యమున నేడు 'జలజాక్షి'లో లండనుకు బయలుదేరి వెళ్లిరి. లండన్ లోనుండగా ఈ నావికులు శిక్షణముకూడ పొందెదరు. రాబోవు జూలైలో ఈ నావలను స్వీకరించు ఉత్సవము జరుగును. అవి రాబోవు సంవత్సరాంతమున మన దేశము వచ్చునని అనుకొనుచున్నారు. 1949 సం|| ములో మరియొక నావికుల జట్టు లండనుకు బయలుదేరి వెళ్లును. (యు. ప్రె.)

## కర్మాగారాల్లో ప్రమాదాల నివారణ ప్రభుత్వ కరపత్రం

న్యూఢిల్లీ, నవంబర్ 6: ఫ్యాక్టరీలలో ప్రమాదాలను నివారించుటానికి ఫ్యాక్టరీల చట్టంలో చేసిన కొత్తసూచనలను ఫ్యాక్టరీల యజమానులు ఏ విధంగా అనుసరించవలసినది సూచిస్తూ, భారతప్రభుత్వ ప్రధాన ఫ్యాక్టరీల సలహాదారు నేడొక కరపత్రమును ప్రకటించెను. ఆధునిక అవసరాలకు తగినట్లు ప్రమాదనివారణ సాధనాలు, పద్ధతులు ఫ్యాక్టరీలలో ఉండవలెనని విధించటమే కాక, వాటిని సక్రమంగా, ఆచరణలో పెట్టేబాధ్యతను, ఈ సూచనలు, యజమానిమీదనే పెడుతున్నవి. ఈ నూతన నిర్ణయాలు 1949 ఏప్రిల్ 1 నుండి అమలులోనికి రాగలవు.

కరపత్రం కొన్ని కొన్ని ప్రమాదాలను ఏ విధంగా నివారించవలసినదీ, చట్టంలో చేయబడిన కొన్ని మార్పులనూ, సుబోధకము గావించినది.

## ప్రత్యేక ట్రేడ్ యూనియన్ సంస్థ

నాగపూరు, నవంబరు 6: కమ్యూనిస్టు పార్టీతో రాజకీయ విభేదములు గలవామపక్షములవారు కలిసి ఒక కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థ నెలకొల్పి దాని ఆధారముతో వామపక్షముల ఐక్యత సాధించవలెనని, అఖిలభారత ఫార్వర్డుబ్లాక్ ప్రధాన కార్యదర్శి ఆర్. ఎస్. రూయికర్ సూచించెను. మహాబలేశ్వరమునొద్ద సోషలిస్టులు సమావేశమై అనేక ముఖ్యసమస్యలపై నిర్ణయించిన వైఖరితో తన ఏకీభావమును తెలుపుచు, వామపక్ష సమైక్యత సాధించుటకు ఫార్వర్డుబ్లాకు సంసిద్ధతను రూయికర్ ప్రకటించెను.

## కాంగ్రెస్ వర్కింగుకమిటీ వద్దకు అసాం రాయబారం

గౌహతి, నవంబరు 7: కాచారు విషయమై అసామ్ వాదమును నవంబరు 12 వ తేదీని సమావేశం కానున్న కాంగ్రెసు వర్కింగు కమిటీవారికి నివేదించుటకు అసామ్ కాంగ్రెసు పక్షమున ముగ్గురితో కూడిన రాయబారవర్గము ఢిల్లీ వెళ్లియున్నారు. ఈ రాయబారవర్గమునకు ప్రధాని శ్రీ గోపీనాథబార్డోలాయ్ గారునాయకులు. నూతన పూర్వాచలరాష్ట్ర నిర్మాణమును ఈ రాయబారవర్గము ప్రతిఘటించునని, కాచారును అసామ్ రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలో చేర్చవలెనని కోరునని తెలియుచున్నది. ఇట్టి విజ్ఞప్తినే కాంగ్రెసు వర్కింగ్ కమిటీకి గావించుటకు కాచారు నుండి మరియొక రాయబారవర్గముగూడ ఢిల్లీ వెళ్లుచున్నదని తెలియుచున్నది.

అ. ప్రె.

## పండిత నెహ్రూ జయంతి

విజయవాడ, నవంబరు 5: భారత ప్రధానామాత్యుడు పండిత జవాహర్లాల్ నెహ్రూ 59-వ జన్మదినోత్సవమును ఈ నెల 14-వ తేదీన ఆంధ్రులందరు జరుపవలెనని రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి ఒక విజ్ఞప్తి చేసెను.

## పట్టాభిగారి జన్మదినోత్సవం

విజయవాడ, నవంబరు 6: భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైన డా|| పట్టాభి సీతారామయ్య పంతులుగారి జన్మదినోత్సవమును నవంబరు 24 న ఆంధ్రులందరు వైభవంతో జరుపవలసిందని రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి ఒక విజ్ఞప్తి చేసిరి.

తాడేపల్లిగూడెం

నవంబరు 5: ఈ పట్టణ కాంగ్రెసు ఆధ్వర్యమున ఈ నెల 24 వ తేదీని శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారి 69 వ జన్మదినోత్సవం జరుగును. ఆ సందర్భంలో శ్రీ పట్టాభిగారి చిత్రపటావిష్కరణకూడా జరుగునని తెలుస్తున్నది.

## భారతసంస్థానాల ఆర్థిక పరిస్థితులు

### పరిశీలనసంఘ కార్యక్రమం

న్యూఢిల్లీ, నవంబర్ 6: సర్ వి. టి. కృష్ణమాచారిగారి అధ్యక్షతన నెలకొల్పబడిన సంస్థాన ఆర్థిక వ్యవహారాల పరిశీలన సంఘం నవంబర్ 3 వ తేదీన మొదటిసమావేశం జరిపి, వివిధ సంస్థానాలు, సంస్థాన సమాఖ్యలు కొన్ని వివరములు పంపవలెనని తెలియజేసినది. ఈ వివరములు అందగనే తరువాతి కార్యక్రమం నిర్ణయించబడుతుంది. సంస్థానాల, సమాఖ్యల ఆర్థిక వ్యవహారములను, పన్నుల విధానములను పరిశీలించి, యూనియన్ రాష్ట్రముల పద్ధతులతో వాటిని సమన్వయించి, దేశమునకంతకూ ఒకే ఆర్థిక విధానమును ఏర్పరచుటకు అవసరమైన సూచనలను ఈసంఘం చేయగలదు. ఈ విషయమై పౌరులు, ప్రజాసంస్థలు మొదలైనవారు ఏమైనా సూచనలు చేయగోరితే నవంబర్ నెలాఖరులోగా పంపవలెనని ఈసంఘం కోరినది.